# విషచ్ఛురిక

గ్రంథకర్త:-
కొల్లేపర వెంకటేశ్వరరావు.
(ఇంటరుసీనియరు)



శ్రీ రామా బుక్కు డిపో,
రాజమండ్రి.

 ( వెల 0-12-0

# విషచ్ఛురిక

(పరిశోధకనవల)

గ్రంథకర్త

కొల్లపర వేంకటేశ్వరరావు.

ఇంటరు గాని యరు.

ప్రకాశకులు.

శ్రీ రామా బుక్కు డిపో,

రాజమండ్రి.

---

రాజమండ్రి, శ్రీచింతామణీ ముద్రాక్షరశాల యందు

ముద్రితము.

1934

 వెల 0-12-0

# మాస్వంతప్రచురణములు

| | | | |
|---|---|---|---|
| గోసాయిచిటికలు | 0 | 6 | 0 |
| బైరాగిచిటికలు | 0 | 8 | 0 |
| దన్వంతరిచిటకాలు | 0 | 8 | 0 |
| ఆయుర్వేదవైద్యసారం | 0 | 12 | 0 |
| గృహవైద్యచికిత్సారత్నం 1 భా | 0 | 12 | 0 |
| డిటో 2 భా | 0 | 12 | 0 |
| దన్వంతరివైద్యం | 0 | 12 | 0 |
| లోలంబరాజీయం | 0 | 12 | 0 |
| భస్మప్రదీపిక | 1 | 0 | 0 |
| నేత్రదర్పణము | 0 | 8 | 0 |
| శతలేహపాకప్రకాసిక | 0 | 8 | 0 |
| సుఖరోగచికిత్సలు | 0 | 8 | 0 |

వలయువారు

శ్రీ రామాబుక్కుడిపో

రాజమండ్రి

రాత్రి పదకొండుగంటలు కావచ్చెను. ఇంకను చంద్రశేఖరముగారు ఆఫీసుపని చూసుకొనుచుండెను. ఆయనింతవరకును ఆఫీసుపని చూసుకొనరు, నేను వారట్లు చేయుటకేదేని కారణముండియుండును.

అది విశాలమైన సావిడి. దానికానుకొనియేయున్న గదిలో వారిసౌధము నధిరోహించుటకు మేడమెట్లు కలవు ఆగదిలోనే ఒక యబల తచ్చాడుచున్నది. ఆమె హృద్వేగముంగాంచిన నామె నెయ్యదియో సంతాపముల చిత్తమైయుండునని గ్రహింపనగును. ఆమెయొకపరి గది గుమ్మమువద్దకువచ్చి గుమ్మమునకున్న తెర కొంచెముగా తొలగించి సావిడిలోనికిం దొంగిచూచును. మరల నిరాశయైనట్టుల వెనుకకుం దగ్గి గది ద్వారబంధమునకు జారగిలంబడి "ఉసూరు" మనుచు నిలువంబడును. మేడమెట్లను మెల్లగా నధిరోహించి సౌధమును జేరి శయనమందిరము జొచ్చి నిజపాన్పుపై నిమేషకాలము మేనువాల్చి మరల లేచి క్రింద కలుకుకుకానుండెగ దిగివచ్చును. మొత్తమునకై నామె పరికారకతో నిరీక్షించుచుండెనని యామెచర్యలు చాటుచున్నవి.

# విషచ్ఛురిక.

చంద్రశేఖరముగారు తలయెత్తి గోడపైనున్న గడియారముపై దృష్టి సారించిరి. పండ్రెండు కావొచ్చెను. ఆయనకు నిద్ర రాసాగెను. పనియంతా కట్టిపెట్టి సోఫాపై బరుండి నేదియో యోచించుచుండెను. ఆయన మధ్యమధ్య సౌధద్వారముపై చూడ్కులు నిగుడ్చెను.

సౌధము ముంగట నేదియో చప్పుడాయెను. ఒకవ్యక్తి అవనితవదనుఁడై లోనికిఁ జొచ్చి గదిలోనికిఁబోయెను. పోవునపుడుమాత్ర మాతఁడు శిరము నెత్తి చంద్రశేఖరముగారిపై దృష్టులు పరపెను. అపుడే చంద్రశేఖరముగారు కూడ నాదెస తిలకించుటఁజేసి వారిదృక్కులు కలసెను. ఇద్దరుని శిరములువంచిరి. చంద్రశేఖరుడుగారు ఆయువకుని చెవులనుండి కారెడు రుధిరప్రవాహముఁ గనుఁగొనెను. ఆయనింకను సోఫాపైనేపన్నుండి చింతానిమగ్నులై స్తంభితులై యుండిరి.

ఆలతివజవ్వని. అందుచే నాపె హృదయసీమ ప్రేమసుమములచే నిండియుండెని. అట్టులుండియు తుమ్మెదకొదమ కలిమిలేమిచే మధుపూరితములగు నవకుసుమములు మధులోపమున ముకిళించుకొనిపోయిన సుమములవలెనుండెను. ఆమధుపము దర్శనభాగ్యమునసేకతా ఆసీమయు నమృతమయమైనటులఁ దెలియుట. అపుడే ఆనందహాస వదన మండలము జ్యోతిష్మతియగును.

ఇంతవర కెవరికొఱ కెదురుచూచుచున్నదో అమ్ముగ్ధత దేఁజు వచ్చెను. వచ్చిరావడములోనే ఆమె కావాలువల్లరులనా

తనమెడ నలంకరించి గాఢమైన సంతోషముతో వాడని ముఖప
ద్మము నిదానించి చూచెను. అయ్యది కళావిహీనమై యుంట
గని నిశ్చేష్టితయ్యెను. ఆమె కరములకు జల్లగా నాతని రుధిర
ముతవల నులికిపడి నాతనువిడిచి వెనుకకు తగ్గినది.

ఆయువకుఁడును మొండిపట్టుదలతోఁ దనకుఁ దవిలిన
దెబ్బనైన లెక్కఁగొనక గృహమునకుఁ జేరెను.ఇంతవఱకు మ
నోబలమునఁ దనకుఁ దెలియకయే తానట్లు చేయఁగలిగెను.
ఇపుడాతనికిఁ జేరవలసిన చోటుఁ జేరితిమికదా యను నాలోచన
గలుగుటచేత నిక నిలువబడలేక నామెభుజముపై వ్రాలిపో
యెను. ఆతరుణోఁడి దుఃఖమునువిగమ్రింగుచు సావిడిలోనున్న
తనఁ దండ్రిగారు వారిగంపరగోళము బసికట్టుదు రేమోయని
భయపడుచు నాతని లేవనెత్తి మెల్లగా నెట్లో మేడమెట్లధిరో
హింపఁజేసి గదిలోనికిఁ దోడ్కొనిపోయి నొకసెజ్జపై నాతని
బన్నుండఁజేసెను.

ఆమె వదనముకూడ కళావిహీనమైపోయినది. చెక్కి
ళులు వణకసాగినవి. కన్నులశ్రుపూరితములైనవి,ఆమె జాగ్ర
తగా నాసెజ్జదరి కూర్చుండి గాయము పరీక్షించినది. వేడి బా
ష్పములు తమంతట తామే ఆమె కన్దోయినుండి జాలువారి
నవి. అవి యాతని పెదములపైఁబడి తడిమొనర్చినవి.అతఁడున్ను
మెల్లనఁ గన్నులను విప్పి "మధూ" అనెను. మధురకిక దుఃఖ
మాగినదికాదు. ధైర్యముపొలిపోయినది. సెజ్జపైనున్న బురుపు
పై ముఖమునుంచి వెక్కి వెక్కి యేడ్వసాగినది. మరల నింత

లోనే ధైర్యము తెచ్చుకొని యాతని పై పరిచూచినది. అతఁ డుతనదెస చూడ్కులు నిలిపియుండెను. ఆతన్ని దగ్గరగా జేరి నది. ఆతని నోదార్చు జూపులతో నట్లే జతికిలిబడి యున్నది.

అంతలో నాతనిశిరమున నొకపార్శ్వమునఁ బడినగాయ ము నాతన్నింగాంచినది. ఇపుడామె బేలయై పోయినది. సహిం పజాలని బాధను నోర్చుకొనుటకై ప్రయత్నించుచున్న యా యువకునిఁ గన్ను లశ్రుపూరితములైనవి. ఇక నేమి యామంజుల వతి యధైర్యయై బావురుమని యేడ్చెను.

నామెనెవరో ధైర్యమునుఁ బుచ్చికొల్పు వీపునఁ దట్టుచు న్నట్టులయినది. ఆమె వెనుదిరిగి చూచినది. నిజజనకు డాక్టరు రమేశము ఆమె కబ్బురము తోషము కొలిపిరి.

ఆతఁడు మెల్లనఁ గన్నులువిప్పెను. దరినే గుడ్డనీరుని ంపుకొని కూర్చున మధుర ముఖకమలమునుఁ గాంచెను. ఆమె కను లశ్రుపూరితము లగుటవే గాక ఎఱ్ఱఁబడినవి. 'మధూ ఎన్ని గంటలయినది' అని ఆతఁడడిగెను. మధుర మృదువుగా 'తెల్లవారవచ్చినది' అన్నది. ఆహా ఆమెకంఠమెంత మధురము. అది ఆతనిని విశ్రాంతి తీసుకొనుటకై మరికొంతసేపు నిద్రింప లాలించినట్టులున్నది. అతఁడు మరల నిద్రించేవాఁడే. కాని మరలనేదియో జ్ఞప్తికివచ్చినటుల కంగారుగా 'నీవింతవరకును మేల్కొనియుంటివా' అనెను. మధుర "దెబ్బ మాపుచేయదూ మాటలాడితే! డాక్టరుగారుచెప్పారు. నిద్రపో" అన్నది. అతఁడు

"నీమాటలేమీ అర్థముకాలేదు. ఈమాత్రపు దెబ్బకుఁ గట్టు కూడ కట్టిరే. నీకు నిద్రలేకున్న—"

ఆమెమందలించుచుతూ "పెంకివాడవు నామాటవినవూ?" అన్నటుల చిఱునవ్వునవ్వి ప్రేమలుట్టిపడ నాతనిముద్దుఁగొనినది. అతఁడుమరలమాట్లాడలేదు. పరిణయడాభాధచే నాతఁసురోగ్య వంతుడై మరల గాఢనిద్రా పరవశుఁ డాయెను.

పొంచియుండి వీరి యనురాగముఁ నిరుపమానమైన ప్రేమనుఁ దిలకించిన చలువ తెమ్మెర కోరకాలంకృతయగు సహకారలతిక కీ సంగతి నివేదింప యామె యానందముతో నిట్టట్టులూఁగుచు నభినయము చేసినది.

మధుర కాతఁడన్న ఎంతప్రేమ! ఆజవ్వని కీవయస్సుననే ఆతని లాలించడములో ఎంత ప్రోఢత్వము. ఇప్పటిలో ఈసౌం దర్యరాసిన బోలిన యువతికానరాదే ఈమెకెంతవినయము.



౨

రాత్రి తొమ్మిది గంటలగుటచే విద్యుక్త దీపములు తగ్గెను. అపుడే ఒకమోటారు రాజమండ్రి ప్రాంతములకు వచ్చెను అదిఇంకను స్త్రీల ఆసుపత్రి (Lady Hospital) జేరనే లేదు. హఠాత్తుగా మోటారు ఆగిపోయెను. రోడ్డు కడ్డముగా రెండు నేరేడి వృక్షములకు పెద్దమోకువంటి త్రాడు భూమికి నాలుగడుగుల యెత్తుగా కట్టబడియున్నది అదికాంచియే మోటారుడ్రైవ రద్దానిని నాపివేసెను. అందులో నొకవృద్ధుడు, నొకయువకుడు యువతియు నుండిరి. వారినిచూచిన పెద్ద స్థితిపరులవలె తోచెను.

మోటారాగెను. ఆక్షణముననే పెక్కురు ముసుగు వారు కారుచుట్టుజేరిరి. అందులోనొకడు నిశితకరవాలముఝుళిపించుకొనుచు నా యజమానుని సమీపించుచు నేదియో మాటనాతడుగర్జించెను..యెవరు వెంటనే ఆతుంటరు లాప్రయాణీకులపైబడి బంధించిరి. అపుడే ఢాం, ఢాం అను చప్పుడైనది. ఆదొంగల గుంపులో నిద్దరు పడిపోయిరి. వారినెత్తుకొని యాదోపిడికాండ్రు పలాయనమైరి.

బంధితులు బెదిరించిరి కేకలువేసిరి. కాని చివర కాశలుడిగి యుండిరి. అంతలో ఢాం ఢాం శబ్ధము వినపడుట, దొం

గలు పారిపోవుట సంభవించుటచే వారానందహృదయులయ్యు సంశయాకులచిత్తులైరి. అంతలో వారిదెసకొక విగ్రహము వచ్చుచుండెను.

ఆతఁడు బంధితులఁజేరెను. ఆతని కుడిచేత రివాల్వరుండెను. ఆతఁడద్దానిని పంట్లాము జేబునందుంచుకొని ఆయజమానుని తరువాత నాయువకుని బంధవిముక్తులనుఁ జేసెను. అతఁడా యన్నులమిన్ననుఁ జూచి వెనుకకుఁ దగ్గిసేకాని బంధవిముక్తురాలినుఁ జేయ లేదు. ఇంతలో నాయువకుఁడు నాపెను నాపి కట్లు సడలించి "సరయూ!" అనెను. ఆమె చిఱునవ్వు నవ్వెనుఁ ఈలోపున నావ్యక్తి మోటారుడ్రైవరు కట్లువిప్పెను. ఆవృద్ధుఁడు 'రామారావు సరయూను దెబ్బలు తగులలేదుకదా ఆమె భయపడినదా! అని ఆయువకుని ప్రశ్నించెను. రామారావు సరయును భయపడవలదని హెచ్చరించెను. వారందరు అనూతనునకుఁ గృతజ్ఞ తాభినందనములొనర్చిరి.

ఆనూతనుఁడు యువకుఁడు. ఆతఁడు పాశ్చాత్యుల పద్ధతినే యుడుపులు ధరించియుండెను.అతనిపేరు వెంకటాద్రి. వెంకటాద్రి యవివాహితుఁడు. ఆచుట్టుపట్ల నాతఁడు రాజువలెనుండెను. ఈతని సౌధము ఆలకట్టుతోటలో నున్నది. ఈతఁడు మోటారుసైకిలుపై షికారునుండి వచ్చువారిని కాపాడఁగలిగెను. అంతియేకాక యీతఁడు వారినారాత్రికిఁ దనసదనమునకతిథులుగా పిలుచుకొనిపోయెను. వారును తమ రక్షకునిమాట త్రోసివేయలేక నాఁటిరేయి నాతని సౌధమునకుఁబోయిరి.

'నరసింహారావు' ఆవృద్ధునినామము, ఆతఁడెవరో తెలి యదు. కాని ప్రస్తుతము జమీందారీ భోగము ననుభవించుచుం డెను. రామారావు, సరయూబాల నీతనిసంతానము. వారిని నోదముకొఱకే యీతఁడు రాజమండ్రివచ్చెను. వీరిపుడు దాన వాయిగుంటలోఁ గ్రొత్తగాకట్టిన చంద్రిమాళీ మహలులో నివ సించుచుండిరి.

వెంకటాద్రి చటకుఁ దరచు వచ్చుచుండెను. వీరు వా ని నెంతయో గౌరవించు చుండిరి. వెంకటాద్రి సరయూను ప్రేమించెను.

... ...

సరయూబాల సాధ్వియేకాని మానగౌరవముల పట్ల మహచెడ్డది. ఆమెహృదయము కరుగని మంచుతునక. యావ నోద్వేగమంగము లామె నావరించినను నామె ఉద్వేగము చెం దు స్వభావురాలు కానేకాదు.

రాత్రి నిథురబోవు సమయమాయినను సరయూవీణి య పాడుచునేయున్నది. వెంకటాద్రి యామె దరినేనిలువఁబడి ప్రణయపురస్సరమైనఁ దూపులు నామెపైఁ బరపి ముగ్ధత్వము నస్తద్భుఁడైనాఁడు.

వెంక—కలవరపాటుఁ జెందిన గళముతో- 'సరయూ' అనెను.

సర—మీకంఠ మెంతమధురముగా నున్నది

వెంక—నీనామములోనే మధువుంది.

ఆమె ఒకహాసమునర్పించెను అందుండిఅమృతముబికెను. పద్దానిని కుతుకలవఱకుఁడాగ్రివుటచే వెంకటాద్రికిఁ గైపెక్కెను, అందుచే అతఁడు శరీరముకూడ మరచిపోయి కంఠముమేళవించి ఇట్లనెను. "సరయూ నిన్ను మనః పూర్వకముగా ప్రేమించి తిని! నాపై జాలికొనవా?"

సరయు— ప్రేమేదో నాకుఁ తెలియదు. నీపై మాజన కుఁడు చూపుచున్న గౌరవమే నీవు నన్నింత బాధించుచున్నను నన్ను సహించియుండునని భోధించినవి—ఐనను నీవు నిరా శుఁడవు కాలేదా?

వెం—లేదు.

సరయు—లక్ష్మియే చంచల స్వభావురాలు. మాన ధనముమాత్రము కాదు. ప్రణయము, ప్రణయభిక్షులు బాగు గనే యున్నవి. ఈకాలమున నందరు నవీనపద్ధతునే అవలంభిం తురు. ఏమో ప్రేమించుకొందురు ప్రేమలో సురిగిపోదురు— ఇవన్నీ దొంగప్రేమలు. సొగసుదనమో, సొమ్మో ప్రేమకాధా రములు. ఈరెండూనశించిన ప్రేమశూన్యము. ఇదియా నిరుప మానమైనప్రేమ—ఏమి నీవు కళావిహీనుఁడవైనట్లు నీవదనము తెల్పుచున్నది. ఇంత—

అని ఇంకను సరయూబాల ఏమియో చెప్పఁబోవు చున్నది. ఇంతలో రామారావు అచటికి వచ్చెను. వెంకటాద్రి రామారావు అచ్చో బాసిపోయిరి.

# ౩

రాత్రి పదిగంటలు కావచ్చెను. చీకటికాల మగుటచే నపుడు కడుభీభత్సముగా నుండెను. గోదావరివంతెనవద్ద నాలుగురోడ్లుకలియు మొగ కలదు. జనులబాట (Road) రైలు పట్టాలక్రిందనుండి పోయినది. ఆత్రోవగుండా నొకసన్యాసి అర్యాపురమునుండి కోటిలింగాలవద్దనున్న సన్యాసుల మఠము కొఱకు కాబోలు పోవుచుండెను. అదే సమయమున ఒకయువకుఁడు అటువచ్చుచుండెను. ఆతడతిబలిష్ఠుఁడు కాకున్నను ఉదగ్రబాహుఁడు విశాలవక్షుఁడునై యుండెను.

అతనికి ఢాం అను శబ్దము వినవచ్చెను. వెంటనే కంగారుగా నాచుట్టుప్రక్కల నాచప్పుడకు కారణమేదియో వెదకెను. ఆతని కొంతదూరములో ననగా మునిసిపాల్ మ్యూజియము తోలుగుమ్మమువద్ద నొక మోటారు కనుపడెను. ఈతఁడద్దాని వైపు పరుగెత్తియే యుండును. కాని యచటనున్న బంగాళాల వైపున నొక యార్తనాదమయ్యెను. తోడనే యాపరోపకారి యావైపునకుఁ బరువెత్తి యటనొకవ్యక్తి క్రిందపడిపోయి యుండుటఁ గనుఁగొనెను. ఆతని శిరమునుండి రుధిరము కారుచుండెను. ఆయువకుఁ డావ్యక్తిని చేతులలో నైచుకొని రోడ్డు మీదకు వచ్చెను. అటనున్న మునిసిపల్ విద్యుక్త దీపము వెలు

గున నావ్యక్తిని పరీక్షించెను. ఆవ్యక్తి యొకసన్యాసి. ఆనూత నవ్యక్తి ముఖమున నేమికళలున్నవో నాయువకుడు నాశ్చర్యుడై నాసన్యాసి ప్రాణములనుఁ దప్పక కావకుతూహల పడెను. ఇంతలో మరియొక రివాల్వరుగుండువచ్చి యాతనికి శిరమునం దొక పార్శ్వమునఁ దగిలెను. ఆతఁడు నిలువలేక పోయెను. తూలిపోయెను. ఇంతలో ఆతని చేతులలోనున్న సన్యాసినెవ్వరో అందుకొనిరి. ఆయువకుఁడానూతనుని ముఖమునుఁ దేరిచూచెను. ఇంతలో నాతనికి బాధమిక్కుటముకాగ స్పృహతప్పి పడిపోయెను.

మరియొక గంటకాలము గడచెను. ఆతఁడు మెల్లగా లేచి యొకపరి దెబ్బను తడివిచూచుకొనెను. ఆతఁడు నిర్లక్ష్య భావముతోఁగూడిన మనస్సున నటనుండి బయలుదేరెను. యేమియీ విచిత్రము. అతనికి బూర్వపుమోటారు కనుపడలేదు. ఆతఁడు నచ్చోటువీడి పోవుచుండెను.

ఈ యౌవనుఁడు మధుమధన మధుమన్మథ సదృశుఁడు. ఆతనిపేరు మాధవుఁడు.

మాధవుఁడు చిన్నప్పటినుండి చంద్రశేఖరముగారి యింటనే పెరిగెను. చంద్రశేఖర మిగా రీతని నవ్యాజమానమైన ప్రేమతోఁ జూచుకొందురు. 'గారం'మె ట్టుదురు. మాధవుని ఆయన బెదిరించినయెనా యెఱుఁగడు ఆయన కుమారిత మధురకీర్తఁడన్న ప్రాణములు. మాధవునివీడి యొకక్షణమేని గడుపలేని మార్గవతి.

మాధవుఁడు బి. ఏ. ఆనర్సు మొదటి తరగతిలో పేసయ్యు ప్రజారంజన సమాలబ్ధకీర్తిశోభితుఁడేకాని ఉద్యోగికాఁడు

చంద్రశేఖరరావుగారి యొద్ద నీతఁడు వినయుఁడు. ఆయనకెంతయో గౌరవము నిచ్చును. ఆయనన్న పితృప్రేమ. ఇత మధుర ఇతనికి హృదయము వంటిది.

మాధవుఁడు 'మూపెంకి' వాఁడు. పట్టుదలఁగల మనిషి. చంద్రశేఖరరావుగారు సబ్ కలెక్టరగుచే నీతనియూఁగడములు కొనసాగుచున్నవి. ఈతనికిఁ బ్రజోపకార ధారీణతయన్న మహాభిమానము. ఇప్పుడితఁడు పట్నాన పరిశోధకత్వముఁ గూడ చేయుచుండెను.

మాధవుఁ డాదెబ్బను సహించుచు మనో బలమున శక్తుఁడై సౌధమునకుఁ జేరుకొనెను.



# 4

కిసన్‌లాల్ రాజమండ్రిలో సంపన్నుఁడగు మార్వాడీ. అతఁడొకరోజున ఆలోచనామందిరములోఁ గూర్చొని యుండగా నతని కొఱకెవ్వరో వచ్చినటుల కబురు వచ్చినది. కిసన్‌లాలు కొంచెముసేపు పరధ్యాన్నముగానుండి యావచ్చిన వానిని లోనికిఁబిలువనంపెను. ఆగంతకుడు నవీనవేషధారియై యుండెను. దృఢశరీరుడు ఆతడు లోనబ్రవేశించి తనకై చూపిన కుర్చీపై నుపవిష్టుండై వాతనికి తానుగొని తెచ్చిన ఎఱ్ఱటి గులాబీపుష్పమునిచ్చెను. అదిచాల పెద్దదై సువాసన గలదై యుండెను. మార్వాడీ యాతని రాకకు గారణమడుగుటకు ముందదేమిజాతి పుష్పమని ప్రశ్నించెను. ఆగంతకుఁడు "ఇది కౌంటి ఆఫ్ మాంటీక్రిస్టో అనే గులాబీపూవట కడియములో గొన్నానండీ" అనెను. ఇంతలో ఆమార్వాడీ చిఱునవ్వునవ్వుచు దానిని వాసన గొనెను. వెంటనే యాతడు స్పృహదప్పి సోఫాలోనొరిగిపోయెను. ఆఆగంతకుడు కడుగభీరుడు. అందుచేతనే వాడెంతమాత్రమూ కంగారులేక తానువచ్చిన కార్యమును కొనసాగించుకొనుచుండెను. ఆతడుక్లోరోఫారమాకిసన్‌లాలుకు వాసనచూపించెను. ఆ పుష్పమును మరల దిరిగి జాగ్రతపెట్టుకొనెను. ఆకిసన్‌లాలుదుస్తులనుఁ దీసుకొని యాతనివలె చక్కగా నలంకరించుకొనెను.

ఆతడు మెల్లగా బయటకువచ్చి యొకపరి ధనాగారము బ్రవే శించి మరల వీధిలోనికి బోయి కిసన్‌లాను మోటారునుస్వయ ముగా నడుపు కొనుచు నెటకో బోయెను.

కిసన్‌లాలు గుమస్తాలు నౌకరు కిసన్ లాలుగారేస్వయ ముగా బండి నడుపుగొనుచుఁ బోవుచుండుట చూచిచకితులైరి. యేమి ఆతడు మోటారు నడుపగలడా! డ్రైవరును పిలువడేమి ఆఆగంతకుడేడి అనుప్రశ్నలు - రు సంభాషణలో పైచుకొని కిసన్‌లాలుగారి గదిచేరిరి. అది తాళము పెట్టబడియున్నది. వా రికనుమానమెక్కుడగుటచేఁగాబోలు తాళము ఁబగులఁ గొ ట్టి లోఁబ్రవేశించిరి. అచట కిసన్‌లాలుగారిని యాయాగంతకు నివేషములోఁ జూచిరి. ఆతడు సోఫాపైపడియుండెను.

*  *  *  *

కిసన్‌లాలు సర్వనాశకుడాయెను. ఆతడు పాతిపెట్టినపదిబం గారు ఇటుకలనేడు లక్ష్మీపూజనిమిత్తమె బయటకుదీయించెను అది యంతయుమాయింపబడెను. ఆతఁడెంతయో సొమ్ము వ్యయ ముచేసి ఆదొంగనుపట్ట ప్రయత్నించెను వాడుదొరకలేదు.

డాక్టరకిసన్‌లాలుకిచ్చిన పూవులో మత్తుమందు పెట్టఁ బడియుండెనని చెప్పెను. పోలీసువారు ఆ ఆగంతకుని రూపము ను కిసన్‌లాలు వర్ణించునటులఁ దమపత్రములలో వ్రాసుకొని రి. అట్టివానిని పట్టుకొనిన పదివేలు బహుమానము.

పోలీసు వారెంతయోకష్టించి పనిజేసిరి. హర్తజాడలు తెలియవాయెను. కిసనులాలు తారుమాత్రము హిందూసమా

ము వద్ద దొరికినది. ఆకారుపై ఎవరువచ్చిరో ఆసబ్యు లేరును చూచియుండలేదట. ఆకారు 'నాది' అనిఎవరును దానికొఱకై రాలేదు. అంతే. ఇక హర్తజాడలే తెలియరాలేదు. అన్వేషణ ముగిసినది. కిసనలాలు మంచముపట్టెను.

రాజమండ్రిలో బేల్మెరహియా అనుపేరుచెప్పిన ఆబాల గోపాలమునకు హాడలు. ఆతడెచ్చటనుండునో ఏమిచేయునో ఏరికిని తెలియులేదు. దౌర్జన్యములు చోరత్వములు చెలరేగినవి. వాటికన్ని కాతడే కారకుడు. కిసనులాలు గృహమున జరిగిన దొంగతనమునుగూర్చి ప్రజలు పెక్కు గాథలు పలుచుండిరి. అతనిని గూర్చి భయానకములైన జనప్రవాదములు కలవు.



# 5

'నామాటవినవా' అని దీనముగా వలపుగా బ్రతిమలాడినది మధురమాధవుని. ఆమె దొడ్డిగుమ్మములో ద్వారమునకు జేరగిలబడి నిలుచున్నది. ఆమె మాధవుని హస్తమునువీడకయే 'బావా! నిన్ను పోనీయను' అనెను.

'చూడు. మధూ! ఇపుడే వస్తాను మామయ్యతో చెప్పుకు' అన్నాఁడు మాధవుడుఁ.

'నేను వెళ్లనీయను. ఆదెబ్బ ఇంకను మానలేదు. నేను తెచ్చిన పిస్తోలు నాకిమ్ము.

'వదులు సినిమాకు వెళ్ళవలెను'

'నేను వచ్చెదను'

'నాస్నేహితులఁతో కూడి వెళ్ళెదను'

'ఐతే ఆపిస్తోలు ఎందుకు'

'ఊరకే రక్షణార్థమై ఉంచుకొమ్మని నాయనగా రంటిరి కదూ?'.

'నన్ను ఆయన 'బావను. కనిపెట్టుకొని ఉండుమధూ అన్నారు'

'నామాట వినవు?'

'త్వరగా వచ్చెదవా'

'ఇప్పుఁడు వచ్చెదను.'

మాధవున కింకను దెబ్బపూర్తిగా మానలేదు. ఆతఁడరుఁడే. ఆసన్న్యాసి కొఱకై తపించి పోవుచుండెను. ఎవరా సన్న్యాసి! ఆమాంత్రికుఁడెవరు? ఆసన్న్యాసి ముఖపద్మమటులుండెనే!

గాలివలె నతఁడూరంతయుఁ దిరుగాడుచుండెను. అతఁడు గున్నేశ్వరాద్రిపు పెండాలు దరినున్న తూముపై నొకకాలునుంచి నిలువఁబడి పెండాలువైపు దీక్షగా చూచుచుండెను. ఆతని కప్పుడే బ్రములుదేరిన మోటారుపైకి దృష్టిపోయెను. అందున్న డ్రైవరుని ఆతఁడు గుర్తించెను. ఆతఁడు హృద్వేగముతో మోటారుదరికిఁ పరుగెత్తెను. మోటారుబయలుదేరుటచే నాతఁడొకింత సేపేదియో నాలోచించి తటాలున వెనుకను కట్టినచక్రముఁ బట్టుకొని కూర్చుండెను. మోటారు శరవేగముతోఁ బోయెను. అది తిన్నగా ఆర్ట్సుకాలేజీప్రక్కనున్న గాలిమేడయొద్దఆగెను.

మాధవుఁడు కారుదిగెను. కారుడ్రైవ రొకస్త్రీమూర్తిని చేతులపై వైచుకొని సౌధోపరిభాగమునకుఁ బోవుట యాతఁడు కనిపెట్టుచునే యుండెను. ఇంతలో నాతఁడు మరల తిరిగివచ్చి నలువైపులఁ బరికించి తలుపులు జాగ్రతగా బంధించుకొనెను.

మాధవున కేమియు తోచినదికాదు. ప్రక్కనున్నయింటియరుగుపై నొకనీడలోఁ గూర్చుండియుండెను. చాలసేపటివఱకాతని కలజడేమియు వినరాలేదు. అతఁడా ప్రదేశమునుండి లేచెను. అప్పుడే ఒకసన్నని ఆక్రందన వినవచ్చినది. అపుడు కొద్దిగా అలజడికూడ వినవచ్చినది. మాధవున కాందోళన మె

క్కాపెను. అతఁడు వీధిలోనున్న స్తంభముమీఁదుగా పైకి ప్రాకెను. సౌధోపరిభాగమును చేరెను. అటనున్న గవాక్షములోనుండి లోనికిఁ దొంగిచూచెను. ఆతనికొక దుర్మార్గుఁడొక స్త్రీని బలవంతము చేయుచుండుటఁ గానవచ్చెను. ఆస్త్రీయెవరు తానెవఁడు. కారు నడుపుకొనివచ్చిన ఆసన్న్యాసిని అంపిన ఆ హంతకుఁడేఁడీ. ఆతఁడు కొనితెచ్చిన యబలయేదీ! ఈపెయే యామెయా? అను భావము లాతనికిఁ దోచెను. అతఁడు పాడయిపోయియున్న ఆకిటికీయూచను నూఁడబెరికి లోఁబ్రవేశించెను. ఇదంతయు క్షణములో ముగిసెను. ఆతఁడా నీచునకడ్డుతగిలి 'శేలలను చెఱఁదెచ్చినందుల కిదిగో' అని యొక్కచెంపడ బహుమానముగా నిచ్చెను. ఆదెబ్బతో నాతఁడు తలఁ దిరుగ క్రిందపడిపోయెను. వెంటనే మాధవుఁడా యబలను ధైర్యము పురిగొల్పి గవాక్షముచెంతకు దోడ్కొనివచ్చి యామెను మెల్లగా క్రిందకు జారవిడచెను. ఆపై నాతఁడును క్రిందకు దుమికి నాపెను మరుల లేవనెత్తి యా కారులోఁ బెట్టెను. ఇంతలో నాతని నెత్తిపై నెవరో గట్టిగా మోదిరి. ఆతఁడు తెలివిదప్పి క్రిందపడిపోయెను. ఆకొట్టినవాఁడు మోటారుడ్రైవరు.

# 6

గోదావరి తీరమున నొక భవనముండెను. అందులీలయను వితంతువ నివసించుచుండెను. ఈమె యౌవనాంకురిత. లావణ్యవతి. అందుచే నీమె నీచమైన ప్రవర్తనకు లొంగిపోయెను. ఐనను ఈమెధర్మకార్యములు చేయును సాధువులను గౌరవించి పోషించును.

ఈమె ఆ రాత్రి నాటకమునకుఁ బోయెను. నాటకమింకను ముగియలేదు. తనమోటారులో బయలుదేరిగాలిమేడవీధిలోనుండి వచ్చుచుండెను. అపుడాదారిలో నొకవ్యక్తి పడిపోయి యుండుట గాంచెను. అతఁడే మాధవుఁడు. ఆసుందరిని రక్షింప ఆమె మాధవుని డ్రైవరుసహాయ్యమున కారులో పరుండజేసి నిజభవనమునకుఁ దోడ్కొనిపోయెను.

మాధవుఁడు సోఫాపై యుపవిష్టుఁడై యుండెను. అతని కింకను మత్తుగానున్నది. ఆతఁడు సేవించిన బ్రాందియే దానికిఁ గారణము. ఆతఁ డాభవనము శోభలుతిలకించుచుండెను. అది శృంగారమైన పటములతో నిలువుటద్దములతో వింతవస్తువులతో (Fancy Goods) వలపులూరుచుండెను. అంతలో నక్కిలికిఁ జిఱునవ్వుతో లీలవచ్చినది. కాలేజీపిల్లలామెను 'లాలీ' అనెదరు. ఆమె ఇపుడు శృంగారవతియై వచ్చెను. ఓరచూపుల నాతనిచూచెను. మాధవుఁడు కృతజ్ఞతలు తెలుపుఁ జిఱునవ్వుల నామె నాహ్వానించెను.

లీల మాధవుని మోహించెను. ఆతనికృతజ్ఞతకుఁ బొఁగెను. 'నీవెంత అందగాడవు' అని హెచ్చరించెను. మాధవుఁడు సిగ్గునఁ దలవంచుకొనెను. ఆమె అతనిహస్తమును ముద్దుగొని విరహాపూరితమగు మేనునువిరచుకొనుచు నాతని కాళ్ళవద్దజేరి యాతనిఒడిలోఁ బడెను. మాధవునిమేను ఝల్లుమనెను. ముఖము జేవురించెను. నాపెను విడల్చుకొన బాహుయుగళము నెత్తెను. అంతలో నేరిదో పదధ్వని వినవచ్చెను.

* * * *

లీల ఆవచ్చినవారి కెదురుగ పోయెను. వారుభయులు కలిసి వేఱొకగదిని ప్రవేశించిరి. కొంతసేపటికి యువకుఁడగు నపరిచితుఁడు వెడలిపోవుచుండెను. ఆతని వదనమండలము కాంచునప్పటికి మాధవుని హృదయము దడదడ కొట్టుకొనెను. తనయొద్దనున్న పిస్తోలు లపహరింపబడెను. కాని లేకున్న యాతని శిరమును మాధవుఁడు పగులఁగొట్టియే యుండును. ఆతనిని వెన్నంటి మాధవుఁడు 'ఆగు' అని కేకవైచెనువాఁడు తిరిగిచూచెను. ఆతని మేను వణకెను. అంతలో నాతడు ధైర్యము కుదుర్చుకొని "ఏమి" అని ప్రశ్నించెను. మాధవుఁడు క్రోధావేశ వివశుఁడై ఆతనిపై లంఘించి నొక్కముష్టి ఘాతము నిచ్చెను. అతఁడు వెంటనే క్రిందపడెను. కాని మరలలేచి జేబులోనుండి పిస్తోలుతీసి నీతనిపై గురిపెట్టెను. అంతలో లీల వీరి మధ్యగా వచ్చి నిలువబడెను. 'వెంకటాద్రీ! ఏమి యీవారుణ

ము' అనెను. ఆమెస్వరము కోపముతోఁ గంపించి పోయెను. వెంకటాద్రి వెంటనే తలవంచుకొని లేచి తనదారిని పోయెను. అతఁడట్లు సగర్వముగాను క్రోధముగాను పోయెను. లీల యింకను నాశ్చర్య చకితయై బొమ్మవలె నిలువబడి యుండెను. మాధవుఁడు ఆమెను జేరెను. ఇద్దరును గదిలోనికిఁ జనిరి.

మాధవుఁడు—అతఁ డెవఁడు.

లీల మారుపలుకలేదు. మాధవుఁ డామెను బ్రతిమలాడెను. అతఁడొక దుష్టుఁడని యామెకు బోధించి నచ్చఁజెప్పెను. లీలయు మాధవునియందు విశ్వాసము గౌరవము నిలిపెను. వారు కొంతసేపు సంభాషించిరి. తరువాత లీల యిట్లు చెప్పదొడగెను.

ఈతఁడెవఁడో భాగ్యశాలి. పేరు వెంకటాద్రి. క్రితము వత్సరము నన్నితఁడు సినీమాలోఁ జూచెను. అప్పటినుండి నాయొద్ద కెందఱినో యనుచరులనంపుచు తన్నుద్వాహమాడు వదిగా కోరెను. వితంతువనైన నాకు వివాహమునం దేచ్ఛ లేకపోయినను నాతఁడు ధనవంతుఁడయ్యు, అవివాహితుఁడయ్యు నాపై ప్రేమకట్లు ప్రార్థేయఁ బడుటచే నా హృదయములో నాశాబీజములు మొలకలెత్తెను. అతని రాకలచేతను, వేషభాషలచేతను అలత క్రమముగా ధిగర్చెను. ఒకనాఁ డతఁడువచ్చి నా రెండు హస్తములను పట్టుకొని దీనముగా తన్ను పరిణయ

కూడుమనదిగా కోరెను. ఆ వేడికోలుకు నేను పూర్తిగా వశురా లనైతిని. ఇద్దరము అనురాగముతో నుండేవారము. నిశ్చయించిన మావివాహమునకు ముహూర్తకాలము సమీపించినది. ఆతఁడు సన్నొకసారి ప్రణయపురస్సరముగా తనసౌధమునకు గొనిపోయినాఁడు. అక్కడ కొంతసేపు విలాసముగా నున్న పిదప దరికిజేరి 'ఓ జీవితేశ్వరి' అని సంభోదించెను. పట్టజాలని యానందముతో కౌగిళ్ళచే జొనిపి ముద్దులచే లాలించితిని. ఆతఁడు కామోద్రేకుఁడైనటులనటించి కామకేళిగూడ ప్రోత్సాహించెను, బలవంతపెట్టెను. అబలనైన నేను అందలి అపాయమును గుర్తెరింగియు ఆతనికి పూర్తిగా వశురాలనైపోయితిని.

ఒక నిట్టూర్పు నిగిడ్చి—

అబ్బా! వెంకటాద్రి ప్రేమనటించిన శఠుఁడు. అప్పటినుండీ యాతఁడు మావివాహమును తలపెట్టనేలేదు. కొంతకాలము నేనుభరింపరాని దుఃఖములోఁబడి ప్రపంచమునుకన్నెత్తి చూడలేకపోతిని. తరువాత మొండినై జీవించుచుంటిని—'

అంతలో నామెకంఠశ్వరము గద్గదమాయెను, ఆమెయిక చెప్పలేదు. మాధవుఁడామెవృత్తాంతమును శాంతముగావినెను. లీలపై జాలిపడెను. వెంకటాద్రిపై ద్వేషమూనెను. ఇపుడాతడు పూర్తిగా వెంకటాద్రిగుణములు గ్రహింపగలిగెను. మాధవుఁడు వెంకటాద్రిగాలిమేడలోనొకస్త్రీనిబలవంతపెట్టెననియు ఆ సమయమున తానడ్డుకొంటిననియు మొదలుగాగల సంగతులామెకు విశదీకరించెను. వెంకటాద్రిపై అమెకు ద్వేషము పుట్టె

భఁజేసెను. ఆమెవలపిపుడు పగగా మారినది. మాధవుని బోధ వలపైన నామె యాతనిపై కసితీర్చుకొన నిశ్చయించుకొనెను అతని రహస్యజీవనము నన్వేషించి యాతని రచ్చకీడ్చ దృఢప్రతిజ్ఞ యూనెను. మాధవుఁడు నాతనిజీవనరహస్యము నామూలాగ్రముగా తెలుసుకొన నువ్విళ్ళూరెను. ఒకరికొకరు తోడ్పడిరి. పట్టుదలవహించిరి. ఆనాఁడే సాయంసమయమున ఆలకట్టుతోటలోనున్న యాతనిసౌధమునకుఁ బయనమైపోయి యాతని వృత్తాంతము వాకబుచేయఁదలఁచిరి.



# 7

ఆనాఁటి సాయంసమయమున మధుర సౌధోపరిభాగ మునందలి గవాక్షమునందుపవిష్టురాలై తదేకదీక్షతో వీథుల న్నియు బరికించుచుండెను. ఆమె తనలోఁ దానే దీనముగా నిట్లు విలపించుచుండెను. 'అయ్యో అపుడే మూడురోజు లయినది. ఈవేళ నైకదా నాఁడు ఇప్పుడు రానూ అని వెళ్ళెను. ఆతని కేమి దుర్ఘటన సంభవించినదో. ఎట్టిచిక్కుల నొక్క బడియున్నాఁడో జీవము లతో నుండెనో లేదో!'

ఆనాఁడు అతఁడు రక్షింపఁబోయిన సన్న్యాసి యెవరు. ఆతనిముఖమెట్లు మాధవు నాకర్షించినది. ఆఆకర్షణా ప్రాగల్భ్యము న నాఁతడు ప్రాణములకైనా తెగించి ఆతనిని రక్షింప కంకణము కట్టుకొనెను. ఆదుర్మార్గులు మాధవుని గుర్తించి బంధించిరా!

నాకుచాల భయముగనున్నది. నేను స్త్రీనై పుట్టితిని. లేకున్న బావను వెదకి తీసుకొనివచ్చియుందును. నావలన ఏమి లాభము బావకు. ఆతనికి సహాయము చేసెడిదెవరు. నాన్నగారు సాహాయ్యముచేసిన బాగుండెడిది. ఈమధ్య బావమార్పు, చిత్రపరివర్తనఁజూచి నాన్నని దీనంగా అత్యవిషయమై శ్రద్ధతీసుకొనవలసినదిగా ప్రార్థించితిని.

బావను గడియసేపైన యుండనిచ్చాకు అతఁడు లేకున్న నశాంతి గాలేదు. నాహృదయములో నొకవిధమైన నావేశము జనించినది. అతనిపైనను రాగవల్లరికూడ పెంపొందినది.

బావ ఎంతటిసొగసుకాఁడు. ముద్దులుమూటగట్టు నాతని పలుకులలో విశేషమేమి? అతనిచేష్టను నీతిని బోధించుచుం డును. నాయన్న ఎంతప్రేమ. బావరాజునికి నాతఁడేదని యీతఁ డితోఁ జిక్కుకొని నాఁడేమోనని భయముగానున్నది. ఆభ యము నాబిడియమును గిల్లివైచి బోరున నేడ్వబుద్ధి పుట్టించు చున్నది. అతఁడు నాహృదయేశ్వరుఁడు కాడా! అతనిపై నాజీ వము లాధారపడియుండలేదా! అతనికడిది నాకు మరణము కదా!

ఆమె తటాలున లేచి కిటికీయూచలపై ముఖమునుంచి బయటరోడ్డుపైఁ బోవుచున్న కారులోనికి దృష్టులుసారించెను. అందునొక శృంగారియు మాధవుఁడు కలరు. ఏమియో కాని మాధవుఁడామెకుఁ గనపడకుండ నుండ నక్కుచుండెను. అది మధుర వీక్షింపక పోలేదు. ఆమె బావా అని కేకవైచినది. ఎక్కడిబావా? అప్పుడేకారు శరవేగముతో నా వీధి దాటిపో యినది.

మధురకు భయముతోఁ గూడిన నొకవిధమైన భయము కలిగినది. అతఁడు మాధవుఁడేనా! అని ఆమెకు సందేహముక లిగెను. మాధవుడయిన నింతకాలమునుండి కనబడడు. సాహసిం చి పలుకరించకుండగనే వెడలిపోవునా? అతఁడు కానోపు

ఆలోచనలతో నామె చాల బాధపడినది. ఆమెకన్నుల నమ్ము నా! హృదయమును నమ్మనా! మాధవుని చూచినది. గుర్తించినది. ఆతని తత్తరపాటుగూడ గ్రహించినది. మాధవునకీల యీబెదరు? ఆయువతియెవరు? ఆతత్తరపాటులేల! ఇప్పటి మాధవునిపోకడకర్థమేమి! అతఁడు మాధవుడే కాకున్న మాధవుని గతియేమైనది. అను ఆలోచన లామె నెక్కువగా పీడించినవి.

ఆతఁడీ మధ్య దుర్మార్గముగా ప్రవర్తించుచున్నాడని యుతనయందున్న ప్రేమను చంపివైచినాఁడనియు, ఎవరో ఆన్నులమిన్న వలలోఁ జిక్కియుండెననియు నతఁడా నాఁటికే యాస్త్రీకై యెద్దియో సాహసకార్యము చేయఁబోయి బహుశః దెబ్బతినియుండుననియు దురభిప్రాయకడి యామెకన్నులనీరు నింపెను.

మాధవుఁడు నాధవుఁడు అతఁడు నాసర్వస్వము. అతనికి నేను ప్రియసఖిని. మమ్ములను విడదీయువారెవరు. విధి మాదె సదూరముగా నుండవలసినదే. నా సర్వస్వము నాతనికిదివరకే సమర్పించియుంటిని. అత డద్దానిని నాహృదయములో దాచుకొనెను. మాధవుఁడు నన్నువీడునా. దుష్టసాంగత్యములు చేసి నిరుపమానప్రేమకుఁ గళంకము తెచ్చినచో నేను జీవములతో నుందునా నాకిక యీలోకములోఁ బనియేమి తదితరభోగములన్నియు నాకు వమ్ముకాదా! నాపతినన్ను మోసగించునా? నాఁడు పోవుచు నాచెక్కిళ్లను ముద్దాడి 'మధూ నీప్రేమ అతీతము అదియే నన్ను చిరాయువుగాదీవించుచున్నది' అనెనుకదా! అత

నీహృదయమెంత కపటమైనదా. దానిని పోషించి పెంచినదినే నుకాదా, దాని సామర్థ్యమునాకుఁ దెలియదా! నా మాధవుఁ డెట్టి యాందోళనలో నుండెనో! నాకుఁ జెప్పువారెవరు. మాధవా! నీకీ కొంటితనమేల? బీదరాలనగు నాపై జాలిగొనవా? అబలనే అసహాయురాలనే, నాపైనా నీకీపిచ్చికోపము ఇదియే కాబోలు ప్రణయకలహము. నాలోనున్న ప్రతి రక్తనాళము లోను నీకై విచారించుటచే రుధిరము కవోష్ణమైపారుచున్నది. వేడి నిట్టూర్పులచే తలయూడిపడుచున్నది. తలనొప్పి జనించెనటన్న లోకమేపోయినటులదురపిల్లు నీవు యీనాడింత నిరసించితివేల. నాకన్నులు నీదరిశనభాగ్యము లేమిఁ యెట్లయ్యెనో. ఇష్టదేవతలకు నేనెంతగా మ్రొక్కుచుంటినో నీవు కనుఁగొనినచో నీవు నాదెస అంతకఠినత్వము చూపియుండవు నీపైనున్న అనురాగముచే కృశించియున్న నన్నుఁ గాంచినచో నేఁజేసిన నేరమునకు నీవెంత సిగ్గుపడియుందువో'అని విచారించుచు నచటఁజతికిలబడియుండెను.

:o:

# 8

దొరబాబు బత్త్యద్భుత పరాక్రమ పరిశోధికాచక్రవర్తి. ఇతఁడు కలకత్తాలో డిటక్టీవు పనిచేయుచుండెను. అచట నీతని ప్రజలెంతయో గౌరవించెదరు. దొరబాబు బెంగాలీబాబు. ఇతఁడా పత్త్కల కసువులు పోయుచుండును. దుర్మార్గ ప్రవర్తకులఁ శిక్షమపరచుచుండెను. వారి కీతఁడన్న హడలు జీవచ్ఛవములయ్యెదరు.

ప్రత్యేక మేదియో రహస్యముఁ గనిపెట్టుటకై యీతఁడురాజమండ్రి పిలువ బడెను. ఇతఁడా విషయము గురించియే పట్టుదలతోఁ బ్రయత్నించుచుండెను. అతఁ డేయూరకోఁబోయి యుపుడే రైలుకువచ్చెను అతనికి కిసన్‌లాలుగారి వృత్తాంతము తెలిసెను. అతఁ డానందరావు హోటలులోఁ గొంచెము టీనీళ్ళు త్రాగి కిసనులాలుగారి గృహమునకుఁబోయెను.అపుడచటపోలీసుఇన్సుపెక్టరు రంగాచారిగారుకూడ నుండిరి. వారు దొరబాబుకు చితమర్యాదలు చేసిరి.పిమ్మట కేసువిషయమంతయు నామూలాగ్రముగా దెలిపిరి. రంగాచారిగారు వారుచేసిన ప్రయత్నములు, మోటారుమాత్రము దొరకుట నేకపురుపెట్టిరి. కిసనులాలుగారు దుఃఖమున మాటిపోయిరి. ఆయన దీనముగా దొరబాబును రక్షించుమని ప్రార్థించెను. దొరబాబు కిసనులాలుకు ధైర్యముచెప్పి వారిసంభాషణల గురించియు నాతని నౌకరిని గూర్చియు పుష్పముఁ గురించియు గుచ్చి ప్రశ్నించెను.

ఆప్రదేశమునంతను పరీక్షించెను. చిఱునగవుతో వారియొద్దసెలవుకొన వెడలిపోయెను. ... ...

దొరబాబిపుడు కడియమ్ము జేరుకొనెను. అతఁడాయూరనున్న తోటలలోనికి బండికట్టించుకొని పోయెను. అచ్చట తోటయజమానులాతని కుచితమర్యాదలు చేసిరి. అందునొకతోటలో నాతఁడు గులాబీమొక్కలను తీవ్రముగా పరీక్షించుచుండెను. అదికనిపెట్టి ఆతోట యజమాని 'ఇది కౌంటీమాంటు క్రిస్టోఅను గులాబీమొక్క. ఇది యీప్రాంతమున నింతకుముందు లేదు. క్రొత్తగా తెచ్చితిమి. ఇది అడిగో అట్టి ఎఱ్ఱని పెద్దపుష్పములను పూయును' అని చెప్పెను. దొరబాబు చిఱునగవుతో 'రాజమండ్రిలో ఈమొక్కలు చాలనునవ' నెను. ఆయజమాని యుఁగిసినమోముతో 'మీరు అటు లనకండి. ఇది రాజమండ్రి మొత్తమున కెక్కడను లేదు వారముగోజులఁ గ్రితము మాత్రము వెంకటాద్రిగారికి పుష్పముతోనున్న యొక నంటు నిచ్చితిమి' అనెను.

దొరబాబు—"సరే! ఈమధ్య దీనినింకెవరు కొనలేదా?

యజమాని—'లేదు'

దొరబాబు దాని ఖరీదునడిగి గులాబీయంటు ఖరీదైదు [illegible]లయితే దిని ఖరీ, దైదురూపాయలేమాయని యబ్బురపడి దానిపై వాంఛచేతనో ఎందుచేతనో ఆమొక్కను కొని తిన్నగా రాజమండ్రికి వచ్చెను.

* * * *

వెంకటాద్రిగారి సౌధో పరిభాగమున నున్న పూల మొక్కలకు సూరఁడీ నీళ్ళు పోయుచుండెను. అతఁడీపుడు సెట్టిపాటలులోఁ బ్రతిదినుబండారమును కుతుకలవరకూ ద్రిం గెను. ఇదంతయు దొరబాబు ప్రోత్సాహమే దొరబాబుకూడ కొంచెముఫలహారముతీసుకొనివారిద్దరికైన పైకముచెల్లించిసూరడి తో వెంకటాద్రిగారిపుష్పాల మొక్కలనుచూడనరిగెను.సూరడవన్నీ చూపించుచుండెను. అతనికి చేతనొక రూప్యముకూడా వచ్చియుం డుటచే నే డాతఁడు మరింత యుత్సాహపూరితుఁడై యుండెను. పువ్వులలో పెద్దజాతులను గురించి ప్రస్తావనరాగ సూరఁడు వాంటు క్రిస్టో అను పూలమొక్కను చూపి దాని యానల్యా మును పొగడి దానిని వెంకటాద్రిగారు వారమురోజులఁ గ్రిత ము కడియములోఁ గొనిరనియు దానిపూవు రెండురోజులక్రిత మే అబ్దులు అను కారుడ్రైవరు కోసుకొని పోయెననియు అతఁడు ప్రియకా వెంకటాద్రి కిచ్చి యుండుననియు నాఁటిరేయి వెంకటాద్రి దానవాయిగుంట నరిసింహారావుగారి చంద్రమౌళీ మహాలునకు బోయిరనియు నచటనాతఁడు బహుశా ఆపుష్పము సరయూబాలయనునా నారసింహారావుగారితనయ కిచ్చియుండుననియుఁ జెప్పెను.దొరబాబు మొండి తనముగా తానటువంటి పుష్పమును వారి డాసితలలోఁ జూచితినని చెప్పి కాదించి వానిని విసిగించెను. అక్కడికి సూరడీ విధముగనే చెప్పుటచే వానికొక రూప్యమునొసంగి నటుఁ బోసిపోయెను.

* * * *

దొరబాబు మారువేషములు వేయుటలో నేర్పరుడు. ఇపుడతఁడు పూవులమ్మకొను కరీముసాహేబువలెనే యుండెను ఆపొడుగు గ్లాసుకోటు గుడిలినీ అలుంగీ, జోడు చుట్టవైఖరి కరీమును తలపించుచుండెను. ఇతఁడిపుడు పూవులబుట్ట పుచ్చుకొని దానవాయిగుంటలో చంద్రిమాలీ మహాలుయొద్ద 'రోజాలు'అని కేకలువేయుచుండెను. సరయూబాల చలివరు పరులు లేమిచె మహాలుగుమ్మములో నిలువబడయున్నది. ఆమెకురోజాలన్న ప్రీతి. అందుచే ఆమె యాతని పిలిచినది. ఇంతలో నామె దాసీయటకు వచ్చి 'రోజాలూ' అని పిలిచినది. దొరబాబిపుడు గంప సరయూముందర పెట్టెను. సరయూఁ చూపులను పరికించుచుఁ దటాలున నొకపెద్ద పూవునుఁదీసి 'ఇదిఏమిపూవోయి' అని ప్రశ్నించెను. దొరబాబు 'ఇది మాంటుక్రిష్టొఅను పెద్దజాతిరోజా' అనెను

సరయు—ఇదే వెంకటాద్రి గారిపూవుల మొక్కలలోఁజూచాను వెంకటాద్రికూడ దానిని గురించిచెప్పెను. ఆయన ఇది కౌంటు మాంటీ క్రిస్టో అనిరి. మరునాఁడు మనమటకుఁబోయినపుదు దానినిపరీక్షించిచూచితిని. అదిఅచట కానరాలేదు.అనిదాసీతో వనెను.

దొరబాబు—అమ్మగారు' మున్నెన్నడు దీనినిచూడనే లేదండి? ఇవిపుడు చాల వచ్చుచున్నవి.

సరయు—లేదటోయి వెంకటాద్రిగారి తోటలో ఇటువంటిదొక్కటే ఉన్నది. ఇవిం కెక్కడను లేవని ఆయనఁజెప్పిరి.

దొరబాబు పూవులను సరయూకిచ్చెను.

* * * *

కడియమునుండి తెచ్చిన పూవులనెను. ఇది యథార్థము
ఇది రాజమండ్రి మొత్తమునకు వెంకటాద్రి యొద్దనేయున్నది.
ఆరాత్రి వెంకటాద్రి చంద్రమహాళీ మహలునకు వచ్చెను. కాని
సరయూకి అది ఇవ్వలేదు. ఇంకేరికైన యిచ్చుట కాతఁడీ ప్రదే
శమునకే యేగుటచే నేరికీ నిచ్చియుండడు. వెంకటాద్రి ఆసువు
మునంత నిర్లక్ష్యముగ చూచినచో దానినంత సరయూవద్ద
పోగడియుండడు. మరి నద్దాని నామెకిచ్చియే యుండును. అం
దువలన దీని రహస్యముతో వెంకటాద్రికి సంబంధ మున్నది.
అబ్బులు! ఈతడెవఁడు. ఈతఁడు సాహసించి యద్దానిని స్వయ
ముగా వినియోగించు కొనునా? అబ్బులు మోటారుతో బాటు
దానవాయిగుంట వచ్చెను. వీరందరు మహలులోనుండ దొంగ
తనమొట్లు జరుగెను. అదే సమయమున కదా కిసనులాలు
మోసగింప బడెను. అబ్బులుగాని వెంకటాద్రిగాని యా హత్య
కుబోలినవారు కారే. వాడతి బలిష్టుఁడు. దీర్ఘశాలి కదా? ఆ
హత్యకు వీరికి సంబంధ ముండియే తీరును. ఏమిదొంగ. పూవు
లైనను యుంచలేదే? ఏచిన్ని ఆనమూలు నాతఁడు విడియుండ
లేదే. ఆతఁడు నాఁడు కిసనులాలుకుఁ దొంగిలిన వసనములు తన
వేననియు యెవఁడో పడిదీ తీసుకొని పోయెననియు చాకలి
వేదిగాఁడు గోలపెట్టు చుండెను. పాపము వాఁడిచ్చిదిన [illegible]

పోలీసువారు బంధీ చేయగా విడిపించినాని. ఈ వెంకటాద్రి ఎవరు?

సరయూ గుణాలపోషకదా! ఏమి ఆపెనిష్కపట హృదయము నన్నిట్లుండగా బహూకరించి నన్ను జీవితము పూర్వులుకొని తెన్నుని చెప్పినది. నరసింహారావు జమీందారుడై యుండ నోవు వెంకటాద్రి సరయూను మోసగించునా? అట్లెన్నటికి జరుగదు. సరయూబాల తనంతట తాను కాపాడుకొనగల ధీరురాలు" అని తలపోయుచు దొరబాబు రాజమండ్రి జేరెను.



# 9

దానవాయిగుంటలోఁ జంద్రమౌళీ మహాలులో నరిసింహారావు భోజనమైన పిదప సోఫాపై నుపవిష్టుండయి తాంబూలము సేవించుచుండెను. సరయూ అతనికి ఆకులకు సున్నము రాసి యిచ్చుచుండెను. ఆమె మధ్యమధ్య జనకునితో పెనోఁగబురులుకూడఁ జెప్పుచుండెను. అపుడెవరు నరిసింహారావు కొఱకు వచ్చిరి. నరిసింహారావా యాగంతకుని ప్రత్యేకపుగదిలో బ్రవేశపెట్టినదిగా నౌకరునకుఁజెప్పి తానా గదిలోని కేగెను. అచట నాతఁడొక పడక కుర్చీలో నుపవిష్టుండయి సిగరెట్టు కాల్చుకొనుచుండెను.ఆనూతనాగంతకుఁడు నక్కడకువచ్చియూ తనికోర్కెపై నొకకుర్చీలో నాశీనుఁ డాయెను.

నరిసిం—"మీారెవరు"

ఆగంతకుఁడు—"నేను నేనే! ఏమి మీారట్లు చకితులుకా నవసరములేదు. నన్నందరు నీవే అందురు"

నరిసింహారావు మొదటకంపించియు నెఱ్ఱవారిన కనులతోఁ వాతనిని తదేకదృష్టి చూచి "ఏమి?" కఠిన స్వరముతోఁ బ్రశ్నించెను.

ఆగంతకుఁడు—'అయ్యా! ఎందుకు మీాకింత కోపము. నన్ను మీారెరుఁగరేమో. కాని మీామనసాకు [illegible]'

నరిసిం—'అదెట్లు'

ఆగం—'ఇప్పటికి వారమురోజులఁ గ్రితము మిమ్ము నేను రైలువంతెనయొద్ద చూచితిని. అపుడు రాత్రియగుటచే మీరు నన్ను చూచి యుండరు'.

నరిసింహారావు దేహము కంపించెను. ఆతనిగళముకూడ బొంగురు వోయెను. ఆయన 'నీవు పిచ్చివాడవు?

ఆతఁడు—అందఱునాదృష్టికిఁ బిచ్చివారు. నేను వారి దృష్టికిఁ బిచ్చివాడను.

నరిసింహా—'ఏమి నీయాగడము. మరియొకమాట పలికితివా నీశిరస్సునుండి తుపాకీ గుండ్లు పరుగెత్తఁ గలవు?'

ఆతఁడు మాట్లాడ కుండుట నభినయించి సౌంజ్ఞలు చేయ మొదలిడెను.

ఇపుడు నరిసింహారావే యున్మత్తుఁడాయెను. ఆదుండగీని చేష్ట లీతఁడు సహింప లేకుండెను. అతఁడు పండ్లు పటపట కొఱకుచు లేచి నిలువఁ బోయెను.

ఆతఁడు—'అయ్యా! దయయుంచి కూర్చుండుడు. మీకంత శ్రమనిచ్చుట నా కిష్టము లేదు. మీరు పిస్తోలు కొఱకై పోవనక్కఱ లేదు. మీకొఱకునే నొకటి కొని తెచ్చితిని'

నరిసింహారావు మరల యథాప్రదేశమున కూలఁబడెను.

ఆతఁడు—ఇపుడు మీప్రశ్నలకు జవాబుచెప్పెదను. నేనే బేల్మెరహియా! అనువాఁడను. నీవునన్ను జడిపింపనక్కఱ లేదు. నీసామర్థ్యము నాకు బాగుగా తెలియును. ఆతుపాకీ

గుండ్లిదివర కొకనిపై పనిచేసినవి కావా? పడిపోయిన ఆసన్యా సి నెత్తుకొని నేనే నాగృహాము చేర్చితిని. అపుడే మిమ్ములన్ను జూచుట తటస్థించెను. మీతో పరిచయమయ్యెను"

నరసింహారావు స్తబ్ధుఁడై పోయెను. నేత్రోన్మీలనుఁడా యెను. "ఆహా ఎట్టిదుస్థితి" అని యాతఁ డనెను.

"ఏమి మీరట్లు విషణ్ణులై యుండ నవసరములేదు. నాకి పుడు కొంతధన మత్యావశ్యకము. దానినిచ్చిన నేను మీసేవ కుఁడనౌదును. లేకున్న ఆసన్న్యాసియే మీచే సొమ్ము ఖరు పెట్టించును"

నరసింహారావు చాల సేపటివరకు మౌన ముద్రితుఁడై యుండెను. అతఁడేదియో దీర్ఘముగా నాలోచించి, చేయవలసిన గార్యముఁ జేయ నిశ్చయించుకొన్నటులఁ దలనూపి యాతని దరికి జరుగుమని యేద్దియో రహస్యసంభాషణఁ జేసెను. తరు వాత ఆ ఆగంతకుఁడు వెడలిపోయెను.

* * * *

ఆహా ఎట్టి కష్టములుకల్గినవి. రహస్యమెరికిఁ దెలియకయేఁ గప్పి పడిపోయినదని మురియుచున్న నాకు పిడుగుదెబ్బ తగిలి నది. ఆసన్యాసి బ్రతికియుండనేల. జీవించియుండెను పోనీ ప్రాం తములకు రానేల. అతఁడింకను జీవించియుండెనా? ఆతని తల నుకొనిన జీవము తెగిరిపోవుచు న్నదే!

ఆ నాఁడీ దొంగవెధవేల యట దాపురించెను! వీఁడసాధ్యుఁడు. నాపై నభియోగము తెప్పింతునని నన్ను బెదరించుచు నాయొద్ద ధనము సంగ్రహించ నుద్దేశించెను. నేఁ జెప్పినటులాతఁడా సన్యాసినివధించునా? అని నరసింహారావు తలపోసెను.

నరసింహారావిపుఁడు కేవలమున్మాదుఁడాయెను. అతఁడెద్దియో మర్మభేదనంబగు బాధ నొందుచుండెను. ఆతనిలోనిపుడు నిర్మలత నశించిపోయెను.

* * * *

ఆ భాగ్యవంతుని కెందులకంత యావేశము? ఆసన్న్యాసితో నాతని కేమి సంబంధము. నాఁటిరాత్రి నా సన్న్యాసిని పిస్తోలుతోఁ గొట్టిన దీతఁడేనా. ఏమి యితఁడు హంతకుఁడా. అంతద్రోహము చేయుటకుఁ గల యవశ్యత నీతని కేలవచ్చెను.

ఆనాఁడు మాధవుఁడు పడిపోవుచున్నతరి సన్యాసినెవరో యాతని హస్తములలోనుండి అందుకున్నారు. అట్లుచేసినది 'బేల్మొరహింయూను' అని చెప్పికొనిన యా ఆగంతకుఁడా. ఐతే మాధవుఁడితని యపుఁడు గుర్తించెను. మరలో గాలిమేడవద్దకు గారును కొనిపోవునపుడు అనగా స్త్రీ నొకతెను చెఱఁగొనిపోవుచున్నపుడు గాంచి గుర్తించెను. అతఁడుకూడ 'బేల్మొరహీయూ' అనువాఁడేనా. ఐతే యీకారుడ్రైవరుకు వెంకటాద్రికి

సంబంధమేమిటి. వెంకటాద్రి కారుడ్రైవ రబ్బులుకాఁడా. అబ్బులు రహీయాయు నొక్కటే. వారిద్దరి పోలికలకు భేదమున్నదే. అబ్బులుకుకూడ ఈ రహస్యములయందుఁ బరిచయ మున్నదా! రహీయాకు వెంకటాద్రికి ఎట్టిసంబంధము కలదు.ఆనాఁడు నరి సింహారావును వెంకటాద్రి దొంగలనుండి రక్షించెనే. ఆదొంగ లెవరు రహీయాగుంపువారుకారా? అట్లయిన వెంకటాద్రియెందుకురక్షించును. రహీయాగాక దొంగలనాయకుఁ డింకొకఁ డుండెనా. రహీయా భయానకమూర్తియా.........

—:o:—

# 10

అది సాయంసమయము. ఆరుగంటలాయెను. మాధవుడు న్మాదునివలెఁ గ్రుమ్మరుచుండెను. అంతలో నాతఁడొక మోటారుపై దృక్కులు సారించెను. వెంటనే యాతఁడా కారు వెంబడించుటకు గంగారుపడెను. డాక్టరు సత్యన్నారాయణ శర్మ మోటారుసైకిలు వీధిలో విడచి తన యాఫీసులోనికిఁ బోయెను. ఆఫీసు మొదటియంతస్థులో నుండెను. మాధవుఁడా మోటారు సైకిలు నెక్కి ఆకారు వెంబడించెను. ఈ ఆలస్యములో కారు చాల దూరమేగినది. ఆకారేదేని సందులోనికిఁ బోవునేమో యని యతఁడు వెరచెను. కాని కారు తిన్నగ పోవుచుండెను. కారు శ ర వే గ ము గా పోవుచుండెను. అందులోనివారు తమను తరుముకొనివచ్చుచున్న మాధవుని చూడలేదు. మోటారతివేగముగ బోవుటచే మాధవుఁడు దానిని కలసుకొనలేకుండెను. మోటారు ఆల్కట్టుతోటవైపు వెళ్లుచుండెను. ఆడ్రైవరువెనుక నెవరోతమను మోటారుసైకిలుపై వెంటాడుచుండిరని పసికట్టెను. ఆకారును తిన్నగా ధవళేశ్వరము దాటిపోనిచ్చెను. రాజమండ్రిలో ఆకారు దొరకలేదని మాధవుఁడు తొలుత విచారించినను దానినెప్పటికైనా పట్టుకొనగలుగుదునని సంతోషించెను. ఆమోటారులో డ్రైవరొక్కఁడే యుండెను. వెనుకసీటులో నెవరో యొకయువతి కూర్చుండినటుల జాగ్రత కని[illegible]ంచినగాని తెలియదు. ఆయువతి [illegible] యున్నగా లేదు,

స్పృహతప్పి పడియున్నది. ఈడ్రైవరెవరు? పూర్వము గాలిమే డవద్దకు మోటారు తీసుకొని పోయిన డ్రైవరే! అందుచేతనే మాధవుఁ డాతనిపట్టుదలతో వెంటాడుచుండెను. మాధవుఁడు ప్రాణములు పోయిననుసరే భయపడువాఁడుకాడు. పట్టుదల యే ప్రధానముగా కలవాఁడు

ఆ కారిపుడు ఫవిళేశ్వరము చేరినది. అక్కడనుండిబొమ్మూరిమెట్టకుఁ బోవు రోడ్డుమీఁదుగా పోవుచుండెను. మాధవునకా దారి యంతకొత్తది గాకపోయినను కారాదారిని పోవుటకా తఁడు విస్మయము చెందెను. అధైర్యుఁడుకాక ఎక్కువ వేగ ముతో మోటారు ననుసరించెను. ఆమోటారునూ ఎత్తయిన కొండపైకిఁ బోయి అక్కడ ఆగెను. డ్రైవరు తన్ను వెంటాడిన వాఁడు శీఘ్రకాలముననే కలసుకొనగలఁడని నిశ్చయించుకొని ఆతని బారినుండి తప్పించుకొనిపోవు నుద్దేశమున ఆకారు నిపు డాపెను పెట్రోలుడబ్బాసుఁ దీసి మోటారుప్రక్కన కొండపై వంచెను కారులోనున్న స్త్రీమూర్తిని అచటనున్న నొకరాతి చాటున పరుండబెట్టెను. ఆమోటారు కిరుప్రక్క లగాధమైన లోయలుకలవు. ఒకలోయనుండి రైలుబాటయుండెను. మరియొకలోయలో చిన్న నీళ్ళగుంటకలదు. డ్రైవరు సిగరెట్టును కాల్చుకొనుచు మోటారునకు గొంచెము దూరముగా నిలుచుండెను. అతఁడు నన్ను వెంబడించెడి మాధవునికై యెదురుచూచు చున్నట్లే నటించక పరధ్యానముగ నున్నటులనటించుచుండెను. మాధవుఁ డతిదేగముగా మోటారును సమీపించెను. తోడనే

డ్రైవరు తనసిగరెట్టు నాపిట్రోలుపైఁ బడవేసెను. పెట్రోలు భగ్గునమండెను. అందుచే మోటారు సైకిలుచక్రములు పెద్దధ్వనితోఁ బగిలిపోయెను. మాధవుఁడగాధమైన మురికిగుంటలో బడిపోయెను. ఆడ్రైవరు తనయుక్తికి తనకుఁదానే కన్నుగీటుకొనుచు స్పృహతప్పి పడియున్న ఆయువతిని భుజముమీద నిడుకొని ఆమెట్టమీద కొంతదూరము పోయెను. ఒకప్రదేశమున గనుమూసి తెరచునంతలో నాతఁడదృశ్యుఁడాయెను. చీకటి గమి గమనములచే నాతనిజాడ గుర్తించుట దుర్లభమైనది.

*　　*　　*　　*

మాధవుఁడు బ్రతికియుండెనా? లోయలోనున్న నీళ్లగుంట అసలొక చెరువు ఇపుడు పూర్తిగా నాచుతో మాత్రము నిండియున్నది. జలము కొద్దిగనున్నది. ఆనాచు సాంద్రముగా నుండుటచేఁ బరుపువలె మెత్తగానుండెను. మాధవుఁడెత్తునుండి తిన్నగా ఆనాచుపైఁ బడుటచేత బ్రతుకునేమో యను ఆశగలిగినది. కాని చెప్పలేము. అతని కిపుడు పూర్తిగా స్పృహ తప్పిపోయెను.

# 11

అది రహస్యమైన పెద్దబిలము. అది బొమ్మాని మెట్ట యందే గలదు. ఆబిల మొక చిత్రమైనది ప్రవేశించుటకు దానికి రహస్యమార్గము కలదు ఆగృహాలో రహస్యమందిరము లున్నవి దానిలోనున్న గోడలుకాని, గదులుకాని, అక్కడ అమర్చిన మీటులు నొక్కిన కదులును కొత్తవాడెవడైనను ఆమార్గమున లో ప్రవేశించి తప్పుగా సరించిన ఏపెద్ద అఘాతములోనో పడి పోవుటయో, అక్కడ రెండువైపులనున్న గోడలు కదలివచ్చి యాతని మధ్యపెట్టి నొక్కివేయుటయో, ఏదో విషపువాయువు వచ్చి యతనిచుట్టుముట్టి విగతజీవు చేయుటయో కత్తులతో నమర్చబడిన బొమ్మల కౌగిళ్ళలోబడి ముక్కముక్కలగుటయో సంభవించును అదిగాక నందు పెక్కుముసుగుమనుజులు కావ నుండిరి. ఇది దుర్భేద్యము కాదా?

*    *    *    *

ఆడ్రైవరు యువతిని భుజముపై నిడుకొని నొక ప్రదేశ మునకుజేరి యొకరాయి తొలగించెను ఆతనికి లోనికిబోవు టకు మార్గమేర్పడెను. అతడు బిలములో బ్రవేశించెను. అతడు మూడవమెట్టుదిగి కొంతసేపు నిశ్శబ్దముగా నిలువబడి రహీంఖాభేల్ అని మూడుసార్లుచ్చరించెను. అటనుండి లోనికి

బోయెను. అది సన్నని పొడుగైనసావిడి. అతఁడట్లుపోయిపోయి ప్రక్కనున్న నొకగదిలో నాయువతి నొకసెజ్జపై జేర్చి యాగది తాళమువైచెను.

అతఁ డటనుండి యొకగదిలోనికిఁ బోయి ముసుగువేషముధరించి సావడిలోనున్న నొక సోఫాపైఁ గూరుచుండి యచటనున్న చిఱుగంట మ్రోగించెను. ఒకరితరువాతగా నొకరు ముసుగువారటకువచ్చి యాతనికి సలాములొనర్చి చుట్టూ జేరిరి. అతఁడు సంజ్ఞచేయగా వారు కంబళిపై నాశీనులైరి. ఒకఁడాతనికి బ్రాందిచ్చెను. అతఁ డద్దానిని సేవించెను. అపుడాయజమాని భట బృందముతో రహస్యాలోచనఁజేయఁ గడంగెను.

యజమానియన్న భటులకెంతయో భయము. వారెంతయో భక్తిని చూపుచుందురు. వారేదిని పొరపా టొనర్చిన ప్రాణములపై నాశ వీడుకొనవలసినదే! అతఁడున్ను ధనమీయుటలోను సౌఖ్యము నీయుటలోను యిబ్బందిచేయఁడు వారికెప్పుడు యుక్తులుచెప్పుచు, జాగ్రతగానుండ అనిశము హెచ్చరించుచునే యుండును. ఆ యజమానియే బేల్మోరహియా అనువాఁడు.

* * *

బంధితురాలైన ఆఅబలఎవరు? ఆపెకెపుడు స్పృహాకలిగెను.రహియాతన్ను భుజముపైవైచుకొని గృహాలో బ్రవేశించునప్పుడే ఆమెకు స్పృహాకలిగెను. ఆమె భీరురాలుకాదు కాబ

ట్టి భయపడక యట్లే మౌనము దాల్చినదై యుండి రహీయా చేష్టలనెల్లఁ గనిపెట్టుచుండెను. అతఁడు బిలములోఁ బ్రవేశించి నపుడు పలికిన వింత మాటలకు నచ్చెరువు నొంది తాను షె ర్లాక్ నవలలు చదివియుంట నది సంకేతకముగా నిశ్చయించు కొనెను.

అలవరాత్రి వెడలిపోయిన కొంత వరకు నాపె యట్లే నిదురను నటించి, తమపరి లేచి, చప్పుడుకాకుండగా తలుపుదరికి జేరి దానిని తెరువఁ బ్రయత్నించి విఫలురాలై తిరిగి సెజ్జదరిచే రెను. అగది అంధకారబంధురమై యుంటచే నామెకేమియుం దు దృగ్గోచరము కాకుండెను. అబలయగుటచే నాపె యుధై ర్యశాలయిపోయినది. మరికొంత సేపటికి నామెకుఁ బదధ్వనిని రాగ తలయెత్తి చూచి మరల నిద్రను నటించుచు పరున్నది.

ఆద్వారము తెరువబడినది. లోన గొందరు ప్రవేశించిరి. దీపమొకటి కూడ వారితోఁ గొనిరాబడినది. వారిలో నొకఁడు 'ఇంకను మత్తు వీడలేదు కాబోలు' అని అనెను. ఆకంఠము మనకు పరిచితమైనదే. అతఁడు వెంకటాద్రియని సరయూ బాల కూడ గ్రహింపగలిగెను.

"ఈపాటికిఁ దగ్గియేయుండును. లేపుదునా" అని రహీ యా అడిగెను. వెంకటాద్రియో నిమేషకాల మాలోచించి 'రహీయా! మన మీవిషయమై చాల జాగ్రతగ నుండవలెను. నిన్ను వెంబడించినవాఁడు సాధారణుఁడుగాఁడు. మనకు మిత్రుఁడం టివాఁడు. అతఁడు మృతినొందిన జాడలనాచోక్కిఁ దీయ మనవా

రీని పంపుము' అనెను. రహీయా శిరమునూపెను, వెంకటాద్రి సరయూబాల సెజ్జదరిజేరి "సరయూ సరయూ" అని ఆమెను లేపెను. ఆమెయు మత్తు వీడిపోవలే చినదానివలె నటించుచు, భయవిహ్వా వేదోద్రేక పూరితములైన బాల కురంగమునయనము తో వారిని తిలకించెను.

వెంకటాద్రి అసహాయయు బంధీకృతయునైన సరయు హృద్వేదనమునైన సరకుఁగొనక యామెను కామింపదొడగెను.

వెంక—సరయూ నీవు నా పల్కులను వినక చెడితివి కదా. నిన్ను మనఃపూర్వకముగా ప్రేమించిన నన్ను తిరస్కరించుటలో నీయుద్దేశ్యమేమి దాని ఫలితమెంత విపరీపముగ మారినదో చూచితివా? నీపై నిలిపిన వలపుచే నిన్ను చెఱబెట్టించితిని, ఇపుడైన నాప్రేమ నంగీకరింపుము. దాననీవు మరల నీవారిని కలసుకొనఁ గలవు. లేనియెడల నిన్ను బలవంతము చేసియైనా నాకోర్కె తీర్చుకొందును.

సరయూబాలకు దుఃఖము కోపము పొంగిపొరలుచుండుటచే ముచ్చెమటలు పోసెను. ఆమె ధైర్యమును కుదుటబరచుకొని ఇట్లనెను.

'ఊ. ఏడిచావు. నీయంటి దుర్మార్గుణ్ణి చేపట్టాలి. నీవీజన్మమున నన్ను పొందలేవు. వచ్చినదారిని మగిడిపొమ్ము. నీ బెదిరింపులకు నేను జడియుదునా. నాకుఁ బ్రాణములన్న నీకున్నంత ప్రీతి లేకపోవుటచే నీకునేను జడియనక్కర లేదు! ఈ నీపాపపుఁ గృత్యమే నిన్ను మట్టుపెట్టును!

సరయూ—'సరయూబాలఁబోలుయువతిని నే నిదివర లోఁ గాంచియుండ లేను. ఆమె ఎంతనాజూకుగా బెదరించినది'.

వెంకటాద్రి చేతిగడియారమును చూచుకొనెను. అప్ప టికి రాత్రి పదకొండు గంటలాయెను. అందుచే నాతఁడు వారిని జాగ్రతగా నుండవలసినదని హెచ్చరించెను. వెంకటాద్రి సర యూవైపుఁ దిరిగి యొక వికటహాస మొనర్చెను. ఆమెకు దా నికి బదులుగా నెక్కిరించియేయుండును. కాని ఆమెఅట్టి ధైర్య ములో లేదు. వారందరును నాగదిని బాసిపోయిరి. ద్వారము బంధించిరి. సరయూబాల రివ్వున ద్వారమువద్దకుఁ బరుగెత్తెను. దానిని తెరువ యత్నించెను కాని నిష్ప్రయోజన మాయెను. ఆమెకు నిరాశ యెక్కుడగుచే బలహీనురాలై యటనే కూల బడిపోయెను.



పోలీసుస్టేషనులో చాల హడావుడిగానుండెను. డాక్టరు సత్యనారాయణశర్మగారు ఇన్సుపెక్టరు రంగాచారిగారు కుర్చీలలో నాసీనులై ఏదియో సంభాషించుచుండిరి. అప్పటికింకను రాత్రి 8 గం॥ కాలేదు. రంగాచారిగారు సత్యనారాయణగారిమోటారు సైకిలు నెంబరును పోలీసువారి నందరను నోటు (Note) చేసుకొమ్మనిరి. దానిని వెదకుటకై వారినిపంప సంసిద్ధులైయుండిరి. అంతలో దొరబాబక్కడకు వచ్చెను. వారాతని కుచితమర్యాదలు చేసిన బిదప వారు సంభాషణలోనికి దిగిరి. డాక్టరు శర్మగారిట్లనిరి 'నేను సౌధముపైనుండి మోటారుసైకిలు స్టార్టు (Start) చేసిన దెవరాయని తొంగిచూచితిని. దానిపైనొక యువకుడుఅపాయమునుకూడ నెంచక శరవేగముతో బోవుచుండెను. దానికిముందుగనే యొక మోటారు పోవుచున్నది. ఆమోటారు నెంబరు నోటుజేసితిని. వానినడిగిన నా సైకిలుపై నెక్కినవాడేదిశగా పోయెనో తెలిసియే యుండును. కాని ఆనంబరు లైసెన్సు రోల్సులోగూడ లేదు. అందుచేమాకిది మరింత ఆశ్చర్య జనకమాయెను.' రంగాచారిగారు తాము చేయఁ బోవు ప్రియత్నము నంతయు దొరబాబున కెకరువు బెట్టెను.

దొరబాబేదియో కొంచెము సేపాలోచించెను. సైకిల న్వెదకించుటకై యెవరిని పంపవద్దనియుఁ దానే యాకార్యమును

సాఫల్యమును చేసుకొనివత్తుననియు నేరినైనఁ బంపిన నాతఁడు ప్రస్తుతము బేల్మేరహియాఅను వానిని పట్టుకొనుటకై చేయుచున్నప్రయత్నముల నిష్ప్రయోజనము లగుననియు నాతఁడనెను. రంగాచారి సైకి లపహరించిన దొంగకు బేల్మేరహియాకుసంబంధ ముండునాయని తరువాత డాక్టరుచెప్పిన పోలికలపై వాఁడు రహియాను పోలియుండడేయనియు నదికాక వాఁడించుమించుగా మాధవుని (కలెక్టరుగారి మేనల్లుఁడు) పోలియుండెనని శర్మ చెప్పుచుండుటచే నాతఁ డెవఁడైనది నిశ్చయించక పోయినను అతఁడును రహియాయును ఒక్కడేకాదన్నియు నట్టి తరి యాయన్వేషణయాపిన "రహియా" పట్టఁబడునాయనియు నాలోచించిరి. ఆయనకు దొరబాబు మాటలకుఁగూడ నవ్వువచ్చినది. ఆయనంటే యెక్కుడభిమానమగుటచేత గ్రుడ్డితనముగా నాయనననునమ్మి దొరబాబుపై భారమువైచి శర్మకేదో నచ్చచెప్పి పోలీసువారి నందఱి నన్వేషణ యనే విపత్తు నుండి తొలగించెను.

* * * *

అపుడే రాత్రి 11 గంటలు కావచ్చెను. దొరబాబిపుఁడు బిచ్చగాని వేషములో నుండెను. అతని నందరు బిచ్చగాఁడే యనుకొను చుండిరి. ఆతఁ డిపుడు ధవళేశ్వరము జేరెను. ఆతఁ డచట నేదియే నేరితోనో సంభాషించెను. తదుపరి బ్రాహ్మణమెట్టకుఁ బోవుమార్గమునఁ బోవుచుండెను, అది

మామూలుగా రెండెడ్లబండి పోయేత్రోవ. కొంతదూరమేగిన పిదప వాతనికనుమానముజనింపనేదియో చింతించి ఇకముందు ఆత్రోవనుమోటారుపోయియుండినచక్రాలయొక్క ఆనవాళ్ళు స్పష్టముగాకనపడును' అనిఅనుకొనిచేదీపము (Battery light) సహాయముననచట పరీక్షించెను. అచటనాతనికేమియు గోచరముకాలేదుకారు మెట్టయేయెక్కియున్నరాళ్ళలో నానవాళ్ళుండవు. అతఁడందుచే నిపుడుమెట్టపై నెక్కుచుండెను. చీకటి యంతటనుదట్టముగా నల్లుకొన్నది. ఇతఁడటులనన్వేషించుచు నొకవైపుకుబిరబిర నడచివెళ్ళెను. ఒకస్థలము జేరుకొనెను. అచటనాతఁడువాసననుబట్టి పెట్రోలు నచటయుంటించి నటులగాగ్రహించెను. దొరబాబుచుట్టుపక్కల బాగుగావెదకెను. అటనేదియో నుపద్రవము ఘటిల్లియుండుననని మాత్రమే యతఁ డూహించెను. అచట నేమాత్రపు ఆనవాళ్ళు దొరకలేదు. అతనికిదూరమున నొక చిన్నదీపము కానవచ్చినది. ఆదీపము నడచుచున్నట్లుండెను. ఆతనిహృదయ మెన్నియో భావములతో నిండియుండెను. ఒకనల్లని సమూహ మాదీపముతోసహా వచ్చుచుండుట నాతఁడు గుర్తించెను. అచటనున్న పెద్దరాతివెనుక దాగుకొని వారలను పరీక్షించుచుండెను. దొరబాబిటుల దాగొనియుండుట కూడ నపాయమే. వారివెదకినచో సులభముగా కనుగొనఁ బడుదుఁడు. ఏమిచేయును. అంతకంటె మంచిరక్షణయేది. ఇరువైపుల లోయలు ఏవైపునకుఁ బోగలఁడు. ఆగుంపుమెల్లగా నీళ్ళగుంట లోయలోనికిఁ బోసాగినది. ఇతఁడది పరీక్షించి ప్రస్తుతము తన

కషాయము రానందుకు సంతసించెను. కాని వారిచర్యల నక్క-డనుండియే పరీక్షింప సాగెను. వారాగుంటను సమీపించి అక్కడ కొంతతడవేదియో వెదకి దేనినో మోసుకొని మరలతిరిగి తాము వచ్చిన త్రోవనే నడువసాగిరి. దొరబాబుకూడ వారి చర్యలను పరికించుచు వారు మెట్టనెక్కి వచ్చినద్రోవను పోపుటచూచి రహస్యముగా వారి ననుసరించెను. వారు కొంత దూరము పోయినదరువాత నొకచోట అంతర్ధానమగుట నాతఁడు చూచి యాశ్చర్యపడిపోయెను. ఆచోట నేదేని బిలముండునాయని దొరబాబుకు సందేహము తోచినది. వెంటనే యాతఁ డాప్రదేశముచేఁ యన్నింటిని పరీక్షించెను. అతనికొకచోట నొకవిధమైన రాయి కనబడెను. అతఁ డద్దానిని తొలగించెను. అచట బిలద్వారము కనబడెను. అతఁడు వెంటనే యదియంతయు బాగుగ పరిశీలించి యొకమీట కనుఁగొనెను. దొరబాబు దానిని నొక్కెను. ద్వారము తెరువఁబడెను. ఆబిలములో నతని కొక యువతియు సన్యాసియుఁ గానఁబడిరి. వీరితనినిచూచి భయసంభ్రమములతో వెనుకకుఁ దగ్గిరి. అంతలో బిలము మూసుకొనిపోయెను. అపుడే యేదియో పెద్దధ్వని విననయ్యెను. దొరబాబు పరాకుగానుండక సరిగ జనుల దూరము పరుగెత్తుకొనిపోయి అక్కడనున్న నొకరాయిచాటున నక్కెను. మరుక్షణమున నేడుగురు నల్లని సుసన్నద్ధాయుధు లాబిలము నుండి వెల్వడిరి. వారు తెచ్చిన దివిటీతో చుట్టును బరికించి తిరిగి లోనికిఁ బోయిరి. ఆ ద్వారమెప్పటివలె మరలమూసు కొనియెను. దానిపై నడ్డుగా పూర్వపు రాయి ఉండెను.

—♦*♦—

15

నరసింహారావు సెజ్జపైఁబరుండియుండెను. అతఁడు మనోద్రేకముచే నీరసుఁడై కృశించిపోవుచుండెను. ఆ సెజ్జప్రక్కనే రామారావుపవిష్టుండై యుండెను.

నరసిం— రామారావా. నాకు మందులు వద్దు మాత్రలు వద్దు. నాకిక జీవితాశ లేదు. నాకుఁ బ్రాణములు పోయవలసినది నీహస్తములలోనే యున్నది. మన సరయూ నెత్తుకుఁ బోయినది రహిమాను సైయదు యూసును. మత్తుమందు పెట్టి తాను వచ్చిన కారులో వైచుకొని పోయియుండును. పైగా వాఁడు నీకు నేనింతకుఁ బూర్వము చెప్పిన కారణము నాధారముగాఁ గైకొని భయపెట్టి నాదగ్గర నున్న డబ్బులాగ ప్రయత్నించుచుండెను. సరయూను గురించి పోలీసువారికి రిపోర్టుచేసిన లాభము లేదని నేనుఁ దలచితిని. నాకుఁ బ్రపంచకములో నన్నిటికంటె ముఖ్యము. [illegible] ఆసన్న్యాసి మరణం. ఆసన్న్యాసి జీవించియున్నట్లయిన మనమందరము సన్న్యాసులమగుదుము. మీతండ్రిగారు నేను నాత్మహత్య జేసుకొనవలసినదే. జమీందారులగు మీవారలు భిక్షుకులై వీధులలోఁ బడి తిరుగవలసినదే. కనుక నేనెంత బాధ నొందుచుంటినో గ్రహించి యువకుఁడవైననీవు ధర్మాధర్మ విచక్షతలఁ జేయక నాముద్దుఁ నీయాప్సిత చెల్లించి కావుము. ప్రస్తుతసాహసమునకు వెనుదీయక యీరాత్రియే సిరయొక్క వ్రేళ్ళలనుఁ జేబట్టిన యాదుర్మార్గు

డగు వెంకటాద్రిని యీ రహీయాను నా ప్రాణకంటకుఁడైన యీసన్న్యాసిని మట్టుపెట్టుము. సరయూను రక్షింపుము. అపుడే నీవునన్ను మరలఁ దిరిగికాంచుము. అపుడు నిన్ను నానిజపుత్రినిగా కౌగలించుకొందును'.

రామారావు కొకవిధమైన యుద్రేకము కలిగినది. ఆదుర్మార్గు లందరిని యప్పుడే చీల్చి చెండాడనాతనికి బుద్ధిపుట్టెను. వారందరి నెట్లు నాశనముచేయుటాయని కొంతతడ వాలోచించి యేదియో నిశ్చయించుకొనెను.జనకుఁడన్న నీతని కెంతయో ప్రీతి.ఆయన అగ్నిలో గుమకుమన్న వెనుదీయని సాహసుఁడు. బుద్ధిమంతుఁడు. మొదటా సన్న్యాసి యెవఁడాయని సందేహము తోచినది. ఆప్రశంసనియుననవసరమనియు జనకుఁడాజ్ఞా పాలించుటయే ముఖ్యధర్మమనియు, కర్తవ్యమ్మనియు తమకొకానొక ప్పుడు రక్షకుఁడైనను అబలయుఁ జెలియలునగు సరయూనుఁ జెఱపట్టిన దుర్మార్గుని నాశముచేయుట ముఖ్యమనియుఁ దలంచెను. ఎక్కువపట్టుదలఁ గలిగినది. అందుచేత ముఖమంతయు గందిపోయినది.ఆకన్నుంగవ యగ్నినిప్పు కణములవలెనుండెను. తన వైపునొకద దేకదృష్టిపరిశీలించుచుండిన జనకునిముఖము వైపునొకపరి. పరికించి యాతనిహస్తమును ముద్దుగొని "అందుల కభ్యంతరము లేదు. మీయాజ్ఞపాటించెదను, పాలించెదను, కృతార్థుఁడ నయ్యెదను' అని ప్రతిజ్ఞచేసెను. అతనికంఠస్వర స్వరములోఁ బట్టుదలయుభితృభక్తి యుండుట గ్రహించి నరసింహారావు సంతుష్టాంతరంగుఁ డాయెను. అతఁడు కుమారుని

'రాములు' అను పూర్వపు ముద్దుపేరుననే సంబోధించుచు కుమారుని పొగడి ప్రోత్సహించెను.

* * * *

నరిసింహారావు సర్వవరము జమీందారుఁడు. ఇతఁడు సుందరమ్మయను సహోదరిని మాధవరావను ధనవంతునకిచ్చి వివాహము కావించెను. అనగా సుందరమ్మ మాధవరావుగారి ద్వితీయకళత్రము.

ప్రథమ భార్యయైన తులసీ చనిపోవుటచే నామెకూతురగు రాజామణి మాత్రము జీవించియుండెను. కొంతకాలమునకు రాజామణి కూడ గతించెను. తరువాత సుందరమ్మ కొక కుమార్తె జనించెను. ఆమెను నరిసింహారావునకిచ్చి వివాహము చేసిరి. మాధవరావున కిక మగపిల్లలు లేరు. అందుచే నరిసింహారావు మాధవరావు ఆస్తికిఁ గూడ తానే నాయకుఁడయ్యెను.

ఈతనికిద్దరు బిడ్డలు. రామారావు సరయూబాల. వీరు యౌవన వయస్కులయిన పిదుప చదువుమానిరి.



# 14

సరయూ చింతిల్లుచుఁ దన సెజ్జపైననే వ్రాలియుండెను ఆమె హృదయము కరుగని మంచుతునక. అందుచే సాహసత్వమున తనకుఁ బైటకుఁ బోవనొప్పుమార్గము దొరుకునేమోయని యాగదినంతయుఁ బరీక్షించుచుండెను. చీకటి గాఁనామె ఇట్లువెదకులాడుచున్నపుడు డాసుకుమారి పాదములకేదో మేకుగ్రుచ్చుకొన్నది. ఆమె అట్టి బాధను సహించుకొనుచు నొకనిమేషము కూర్చుని, యామేకు నేమోయని లాగివైచెను. దానిని లాగుచుండ నామెకొక సన్నని కాంతిప్రదేశము కనబడెను. ఆమె ఇంకను పట్టిలాగుచుండుటచేత ఆకన్నము పెద్దదై బిలద్వారమువలె నేర్పడినది. ఆసమయముఁ దడుముకొనుచూ బిలము పరిశీలించుచుండెను. ఆమెకు మెట్లు బిలములోని కున్నటులఁ దోచుటచే నామె తడుముకొనుచూఁ గ్రిందకు దిగ ప్రయత్నించెను. ఆమె నిరపాయముగా మెట్లనుండి దిగవచ్చెను. కొంతదవ్వేటు లేగుసరికి ఆమెకుఁ గొద్దిగా వెలుతురు కనబడెను. ఆచిన్ని వెలుతురు సహాయ్యమున నామె యొకగదిని జేరుకొనెను. ఆగదిలో నొకమూలఁబడియున్న స్త్రీమూర్తి నిగాంచెను. ఆమెదరికి జేరి యద్దానిని పరీక్షింపగా యామూర్తి జీవములుఁ బాసినటుల గ్రహించి యొకవిధమైన భయముతో గెవ్వున కేక వేసెను. కొంతసేపటికి దేరుకొని భయభ్రాంతయై తిరిగి తనగదిని జేరనిశ్చయించుకొన్నది ఆ ధీరగోడ నానుకొని లేవబోయినది. అదేమోగాని హఠా

త్తుగా నక్కడొక ద్వారము తెరువఁబడినది. ఆమె యాశ్చర్య చకితయై, భయవిహ్వలయయ్యు కుతూహలముచే పురికొల్పఁబడి యామార్గమునఁ బోవ సాహసించినది. ఆమె మెల్లు మెల్లిగా ఆ రెం డవగదిని బ్రవేశించెను. అందుఁ బరికించఁగా నచట కూడ నొక వ్యక్తి మూర్ఛపడియున్నట్టుల దృగ్గోచరముకాఁగ 'ఇదంతయుఁ పిశాచగృహము. ఇట మనుజులను నమిలి తినుచుందురు' అని ఆమె తలంచి నిలువఁ బడలేక నచ్చట కూలఁబడి పోయెను. అంతలో నామెకొక సన్నని మూలుగు వినవచ్చినది. అది సరయూకు మరింత భయసంభ్రమములు గొలిపెను. సరయు మెల్లగా దేహము నీడ్చుకొని గుండెలు చేతఁబట్టుకొని యావ్యక్తి దరికిఁ జేరినది. ఆవ్యక్తి ఎవరు? ఒక సన్యాసి. సరయూబాల ఆసన్యాసి జీవనాళములందెంకను రుధిరము ప్రవహించుటచూచి యానంద హృదయయాయెను. ఆసన్యాసియు సన్నముగా మూలుగుచుండెను. వెంటనే సరయుఁ దనస్థితి జ్ఞాపకమురాఁగ నాసమయమునఁ దనకొట్టి కేన్సురైన వచ్చినచో, దాను బెక్కునిడుములు పడవలసియుండుననియు సుస్థితబుద్ధితో నచ్చోటుబాసి యెట్లో మగుడ నా గదిం దాటి గదిద్వారమును మూసివైచెను. ఇంతలో నేదియో యలుకుడు కాఁగ నామె తన సెజ్జపైబరుండి నిద్రను నటించుచుండెను.

పదములచ్ఛప్పుడు వినవచ్చెను. ఆగదితలుపుఁ దీయుచున్నటుల ధ్వనియాయెను. ఒక ముసుగు మానిసి ఫలహారమునుఁ గొనివచ్చి నిద్రను నటించుచున్న సరయూను లేపెను సరయూ

త్రెచి యీ ఫలహారముల నందు కొనెను. అందుకొనుటలోనా మె చిరునవ్వు నవ్వుతూ నాతని హస్తమును స్పృశించినది. ఆత నిమేనెల్ల గగుర్పొడచినది. ఆతఁడామె పాదములదరి కూర్చుని యనురాగమైనఁ దూపులతో నాపె పాదములు స్పృశించఁబో యెను. సరయూ మంద హాసముతో నాతని హెచ్చరించెను. ఆతఁడు జ్ఞానశూన్యుడై, ముగ్ధుఁడై ప్రపంచకము మరచి నప్ర మత్తుడైయుండె. సరయూబాల ఆతఁడు పరాకుగా నున్నపుడు తనయొద్దనున్న చిరుకత్తితో ధైర్యముగా సత్తుఁగొలది నాత ని పొడిచి చంపేసెను. ఆహా స్త్రీయైనను సరయూబాల యెం తసాహసి. అపుడామె కేవలము శక్తివలె మారిపోయెను. ధై ర్యమంతయు నామెనేయీ వహించెను. ద్వారమును జారవైచి వాడిని తన సెజ్జపైఁ బరెండఁజేసి తిరిగి బిలము ప్రవేశించెను. ఆమె యీ సన్న్యాసిని జేరెను. అతఁడు కన్నుంగవ నిప్పి దా హముదాహమని సౌజ్ఞచేసెను. సరయూబాల మరలఁ దనగది కిబోయి ఫలహారాదులు కొనివచ్చినది. ఆసన్న్యాసి వదనము నఁ గొన్నినీళ్ళు చిలకరించి త్రాగుటకై మరికొంతనీరము నాత నికిచ్చెను. అతఁడు సోగకన్నులతో కృతజ్ఞతలు తెలిపెను. సర యూబాల నా సన్యాసిని ప్రోత్సాహించి ఆహారపదార్థములు భుజంపజేసినది. అమెకూడ అతని ప్రోత్సహామువిూద కొంచె ముగా భుజించెను. ఆతనిని మెల్లగా లేవనెత్తి యూతఁడు తన భుజములపై నానుకొని నడచుచుండ తనగదిని చేరినది. ఇపుడు సన్న్యాసికిఁ గొంతసత్తువ గలిగినది తనంతఁనాను నడుపుట కా

తను శక్తి కలిగియుండెను. సరయు బాల నతని బరిస్థితులను మెల్లగా బోధించెను. సరయు నాతని దోడ్కొని పరారికాజొచ్చినది. ఆమె మూడవమెట్టు జేరగనే సాహసముతో సంకేతనము నుచ్చరించినది అంతలో బిలద్వారము తెరువబడెను. బయటకు బోవ యత్నించుసరికి వారికెదురుగా నొకవ్యక్తి ప్రత్యక్షమాయెను. అంతలో వెనకకు వారు భయపడి తగ్గిరి. పెద్దధ్వని వెనుక వారికి వినవచ్చినది. ముసుగు వారు పదిమంది ఆయుధముల తో బ్రత్యక్షమైరి బిలద్వారము మూయబడినది. వారు మరల బట్టుపడిరి.



'జ్వరము తీవ్రముగాయుండెను. ఐనను నారింజకాయ రసమైన కాస్త యిచ్చినయెడల జివ జేరుకొనును. ఇంత బలహీనముగా నుండరాదు' అన్నాడు డాక్టరు రమేశం మధుర నాడిని పరీక్షించుచు.

చంద్రశేఖరం "సాయంత్రము య్యేటప్పటికి 103 జ్వరమువచ్చుచుండెను. నారింజకాయలు తెచ్చినవి తెచ్చినట్లేయుండెను. ఒక్కకాయరసమైనను కడుపులోబడల్లేదు"

రమేశం—'ఈడాక్టరులందరిని పిలచి మీరు మందులిప్పించిన లాభములేదు. మీరుదగ్గరనుండి -'

చం—"ఎప్పుడూ దగ్గరనే ఉంటాను. ఆఫీసుకు సెలవు కూడ పెట్టితిని"

ర—'కొంచెమున్న నారింజరసము పట్టించవలయును'

చం—'ఆవాలకముచూడండి నాచిట్టితల్లి కెముకలుమిగిలినవి. బలహీనతచేత నామె పరున్నను నెప్పు లనుచున్నది'

ర—'చూచారామరి-ఆతనివిషయమై మీరు యత్నించుచుండిరా?'

చం—'మీకు నిన్నను చెప్పలేదటండీ. దొరబాబు కలకత్తానుండి పిలిపించినదెందుకు మాధవునికొఱకుం గాదూ! ఇపుడతఁడు ఆతనినే అన్వేషించుచుండెను. నాకు—'

ర—'ఐతే మీారాతాని గురిం చేదియో నిన్న చెప్పఁ బోతిరే'

చం—అతఁడు నిజముగా మా అల్లుఁడు కాడు. అసలు నాకు సోదరియే లేదు'

రం —'అహా!''

చం —'యోగానందస్వాములవారిపేరు వింటిరా?'

రం—'ఆహా విన్నాను. ఆయననుగురించి ప్రజలు వింత గా చెప్పుకొనేవారు ఆ రోజుల్లోనే నా వివాహము కూడ జరిగినది'

చం—"ఆయనయేనండి. ఆస్వాములవారు బెజవాడదుర్గ కొండమీాదనున్న అర్జునుని గుడి ఉండేదానిలో నుండేవారు అపుడు బెజవాడలోనే తహసిలుదారుగా పనిచేయుచుంటిని. నేనాయనను మనసదనమున కాహ్వానించి భజనలు చేయించితిని. ఆయన ముఖారవిందమునుకాంచిన సాక్షాత్ భగవంతుడే ప్రత్యక్షమైనట్లు తోచెడిది. అపుడే నేను సప్తాహముకూడ చేయించితిని. ఆసోఫాపై దయ చేయండి-''

ర—"చిత్తము. మీారుకూడ దానిపై—ఊ తరువాత వారిద్దరు నుపవిష్టులైరి.

చం—"అపుడొకరోజున మాగిరమునకు విచ్చేసి—నేను భార్యాభర్తలమాయనను పూజించేవారము, అప్పటికింకా సంతతిలేదు. ఆయన మాయొద్దకొక చిన్నిబిడ్డ నెత్తుకొనివచ్చి 'ఇదిగో నీతఁడు నాకుట్టువాఁడు పెంచుకొనియెదరా'అనెను

ఆయన తమబిడ్డడనటమువల్లనుఅనగాఆయనదివృద్ధాప్యంకదండీ-అందుకుమాకు నవ్వువచ్చినను ఇద్దరమేకగ్రీవముగా మహాప్రసాదమన్నాము. వెంటనే ఆయనాచిన్నిబిడ్డణ్ణి మాకందించెఁ. ఈతని గారముగా పెంచుకొనుఁడు. నందునకు యశోదకుఁ జిన్నికృష్ణుఁడు లభించినటులగా మీకీ 'మాధవుఁడు లభించెను' అని మాదరిగా జేరి 'మీరేమీ సంకోచించకుఁడు. ఇతఁడు సత్యముగా సద్వంసజుఁడు. గొప్ప పదవికి అర్హుఁడు. మీకు శీఘ్రకాలమునే మగువజనించును. వీరిద్దరి నొకేరీతిని చూచుకొని పెంచి పెద్దవారినిచేసి వివాహము చేయుము' అని యాపాపను దీవించి వెడలిపోయెను. ఆవెళ్లుటవెళ్ళుట మరల నాకాయన దర్శనభాగ్యము లభింపలేదు. ఆయన సంగతియే తెలియదు. ఆయనఁ జెప్పినట్టుగా నదేమి సత్యమో మూఁడువత్సరములకు మాకాఁడుపిల్లయే—యీమధుర—'

అనిమధురవైపుఁ జూచెను. రమేశము కూడ ఈవింతగాథ నాశ్చర్యముగా వినుచు మధురవైపుఁ జూచెను. మధుర ఇంతవరకుఁ దదేక ధ్యానముగా వీరిసంభాష నలనాలకించు చుండెను. వారుఁదనవైపునకుఁ జూడగనే యదేమోగాని యామె విశాలాక్షువులలో జలముగ్రమ్ముకొనెను ఆమెతల నొకప్రక్కకుఁ ద్రిప్పివైచెను.

రమేశము:—'మధుర'అని ఆమెను పిలచి చంద్రశేఖరంగారితో 'మనమాటలను వినుచున్నది కాబోలు' అనెను.

శేఖరం గారు కొంతసేపు మౌనముదాల్చి యొకనిటూర్పువిడచి యిట్లు మరలఁ జెప్పఁ దొడగెను.

దొరబాబును మాధవుని పూర్వగాథనుఁ దెలుసుకొన నిర్ణయించితిని. నాకేమీ మరో అభిప్రాయము లేదు. ఇద్దరికి యావన మంకురించినది. అతని వృత్తాంతమును కనుఁగొనుటలోఁ గుతూహలము జనించినది'.

రమేశము—అగును లెండి. దొరబాబు మంచి నేర్పరియట. కిసన్‌లాలుగారింట జరిగిన దోపిడినివిని ఆయన 'దొంగ ఎంత తెలివి హీనుఁడు. సులభముగా పట్టుపఁబడును' అనెనట.

చంద్రి—అవును. ఆయన ధీశాలియే. అతఁడు మనవిషయమై హిమాలయ పర్వతప్రాంతములకు వెళ్ళివచ్చెను.

రమేశము—ఎందులకో!

చంద్రి—అక్కడ యోగానందస్వాముల మఠముండెనని యాతఁడు తెలుసుకొనెను. పాపము యోగానందులు పరమపదించిరట—క్రిందట నెలాఖరునే

రమేశము—శ్రీహరీ!

చంద్రి—ఆయనకు ముఖ్యశిష్యుఁడు చిదానందస్వాములట. గురువుగారు స్వర్గస్థులైన కొద్దికాలమునకేఁ జిదానందులు ఈ ప్రాంతములకు వేంచేసిరట. ఇప్పుడు రాజమండ్రిలోనే యున్నాడనట.

రమేశము—'ఆలాగునా!'

చంద్రి—ఇపుడాయనను గురించి దొరబాబు వెదకుచుండెను. తరువాత మన మాధవుఁడు సాధారణ వంశజుఁడై యుండడని దొరబాబుద్దేశ్యము.

మొదలు గాఁగల సంగతులు వారు ముచ్చటించుకొనుచుండిరి.

*    *    *    *

మాధవుఁడు సుగుణుఁడగుటచేతను ప్రేమమూర్తి యగుటచేతను మధురహృదయములో నాతఁడు నాటుకొనిపోయెను. ఆవృక్షు మెండిపోయినదనే శంకచేత నామె హృదయము కూడ బీడుపడసాగినది. మాధవుఁడు వెళ్ళి వారమగుటచే నామె యూతనికై తపించిపోచుండెను. ఆప్రణయతపస్విని నిద్రాహారములు మాని చిక్కి శల్యమైపోవుటయే కాక జ్వరపీడితకూడ ఆయెను. ఇపుడామెకుఁ గ్రొత్తగా ఒక ద్వేషముకూడ జనించినది. 'ఆస్త్రీ ఎవరు. అట్లు ఆమెతోఁ దిరుగు బదులు నిర్భాగ్యురాలునైన నన్నొకసారి తొంగిచూడకూడదా' అనియే ఆమె దుఃఖము.

# 16

అప్పటికప్పుడే రాత్రి పదకొండు గంటలు కావచ్చెను. చీకటి నలుదిశల నాట్యము చేయుచుండెను. ఆలకట్టుతోటలో నున్న విద్యుద్దీప కాంతులతో మెరుగుచున్న సౌధములో అలజడి యేమియు లేదు. నిశ్శబ్దముగానుండెను. కాని ఒక్కఁడె విమాత్రమా ప్రాకారము చుట్టును తిరుగుచుండెను. అతఁడే రామారావు నరసింహారావు కుమారుఁడు. ఇతన్ని రాములని కూడ ననియెదరు. ఇది ముద్దుపేరు కాఁబోలు. రాములు కష్టించి ప్రహరీగోడ నెక్కెను. మెల్లగా లోఁబ్రవేశించెను. అతనియొద్ద నేదియో ఒకవస్తువుండెను. ఆతఁడద్దానిని జాగ్రతగ పట్టుకొనియే యుండెను. రాములు ఎక్కువ జాగ్రదావస్థలో నుండెను. రివాల్వరును మరల సరి చూచుకొని ముందునకుఁబోయి ఆసౌధము నెక్కుటకై ప్రయత్నించెను. ఆతని కొకగెడ కనబడినది. తనయొద్దనున్న వస్తువు రహస్యప్రదేశమున దాచి యాగెడ సహాయ్యమున సౌధము మొదటియంతస్తు జేరుకొనెను. అచట నదృష్టవశాత్తు తలుపులు తెరచి యుండుటచే లోఁ బ్రవేశించి మూడవ సౌధోపరిభాగము చేరుకొనెను. రాములు వెంకటాద్రి గది సమీపించి గదియొద్ద కొంతసేపేదేని శబ్దముగాని సందడిగాని వినవచ్చునేమోయని పొంచుండి వినెను. అతని కేమీ సవ్వడి వినరాలేదు. అందుచే మెల్లగా తలుపును గెంటి లోనికి దొంగి చూచెను. వెంకటాద్రి పాన్పుపై త్రేడు

మరియెచట నుండును. ఎచటి కేని వెళ్ళెనా? రాములు లోఁబ్రవేశించెను. అంతా నిశ్శబ్దము. అతని కాశ్చర్యము సంకోచము కలిగినది. ఇంతలో వీధిలో మోటారు చప్పుడయినది. ఆమోటారు తిన్నగా సౌధములోనికే వచ్చెను. అందుండి వెంకటాద్రి దిగుట రాములు చూచెను. వెంకటాద్రి సౌధముపైకి వచ్చుచుండెను. అబ్దులు డ్రైవరుకూడా నాతని ననుసరించుచుండెను. వారు పైకివచ్చుచుండుట చూచి రాములు ప్రక్కగదిలోనికిఁ దప్పుకొని గొళ్ళెము వైచుకొనెను. వెంకటాద్రి తనగదిని జొచ్చెను. అబ్దులుకూడవచ్చి గుమ్మముదగ్గర నిలువబడెను. వెంకటాద్రి వచ్చీరావడముతో నే పాన్పుపైఁబడి యొకసారి దొరిలి బద్ధకముగా యొడలువిరచుకొనెను. వెంకటాద్రి అబ్దులును దగ్గరగా రమ్మని పిలిచెను. అబ్దులు లోనికేగెను. రాములు గోడదరిగా జేరి చెవులునిక్కించి వారేమిచెప్పుకొనెదరో యని వినుటకై సిద్ధముగానుండెను. వెంకటాద్రి అబ్దులుతో నిట్లనుచుండెను. 'అబ్దుల్ నాకొక సందేహముగా నుండెను. మనము బొమ్మూరి మెట్టనుండి తిరిగి వచ్చుచున్నప్పుడు ధవళేశ్వరముమొగలో కారునాపి మతలనక్కడనున్న సందులోనుండి కారుఁ గొనివచ్చితిమి. జ్ఞాపకముండెనా. అపుడెవఁడో బిచ్చిగాఁడు మెట్లపై నెక్కుచుండెను. వాడిని నేను చూచితిని గాని మనలను వాఁడు చూడలేదు. ఎవఁడైన నేమి. ఈదినమున మనము జాగ్రతగా నుండుట చాలమంచిది.'

అబ్దులు—ఎవరయ్యా అంతసాహసించేది

వెంకటాద్రి—అటులకాదు. మనజాగ్రితలో మనముం డుట మంచిది—

సరయూబాల ఎంతపెంకితనము చేలినది. రేపుదానిపని చెప్పెదను. రహియా వేశ్యాగృహమునకుఁ బోయియుండు.గృహమును సంరక్షించు వారెవరు. నీవువెళ్ళెదవా? జాగ్రితగనుం డగలవా?

అబ్దులు—దెబ్బని. నాసామర్థత మీకుఁ తెలియదు.ఆరో జునమీకు మనదొంగలఁబంపి నరిసింహారావు కారునాపుఁజేయించి మీరు రక్షించువారివలె పిస్తోలు పైకిపేల్చినపుడు దెబ్బతగిలినటుల నేను క్రింద పడిపోయెను. నేను పడుచూ ఇంకొకణ్ణి కూడ పడగొట్టితిని.

వెంకటాద్రి—అవునవును. వాళ్ళను ఎంతచమత్కారముగ మోసగించితిమి. నేనువారిని రక్షించితిననుకొనిరి కాని మనపంతము చెల్లలేదు సరయూ పెంకిదైనది. దానికేమి గాని నీవు వెంటనే జాగ్రితగా నడ్డదారిని రైలుగట్టుమీదనుండి వెళ్ళి మెట్టయెక్కి గృహములోఁ జేరుము. 'రహియాబేల్' అనుసంకేత పదమును మార్చివేయుఁడు. జాగ్రితగానుండుడు. వెళ్ళుము. అయితే కాంతము చనిపోయెనేమో చూచి నామె శవమును తోలగించుడు.

§ § § §

రాములుకుఁ గర్తవ్యమేమిటి. అతఁడు వెంకటాద్రినియ

ను సదనమునకుఁ బంప దలంచెను. కాని అబ్దులు వెడలిపోవుచుండెను.

ఇపుడు చంపిన అబ్దులు తిరిగివచ్చును. అబ్దులును వెళ్ళనిచ్చినవాని ననుసరించుటయెట్లు. అనుసరించకపోయిన సరయూబాల దక్కునా! సన్న్యాసి మృతుఁడగునా! ఇవియేకదా యాతని ముఖ్యవిషయములు అనుచే వెంటనే రాములు సౌధము దిగివచ్చి తాను దాచియుంచిన వస్తువును మరల నాప్రదేశము నుండి తీసి దానిని పుచ్చుకొని త్వరితగతి సౌధమును దాటి అబ్దులుననుసరించెను. రాము లతిజాగ్రతగా నేర్పుగా అబ్దులుకుఁ దెలియకుండగనే యాతనిని వెంబడించుచుండెను. అబ్దులు రైలుమార్గము మీదుగా పోయి యొకచో - గి అటనుండి మెట్టపైకిఁ బోసాగెను. అతఁడు మెట్టనెక్కి నలుప్రక్కలఁ బరీక్షించి మరలఁ బోవుచుండెను. రాములుకూడ రహస్యముగా త్వరితముగా నాతని ననుసరించుచుండెను. ఒకచోట అబ్దులాగెను. అదియే బిలమునకుఁ బోవుదారి. ఆతఁడందు ప్రవేశింప నారాయినితొలగించి మీటునొక్కెను. బిలద్వారము తెరువఁబడెను అదియే సమయమున రాములాతనిపైబడి గిక్కురుమనకుండ బాకుతోఁ బొడిచి చంపివేసెను. అపుడతఁ డాతనినొక రాయితొనుకకు నీడ్చివైచి యాతని యుడుపులు తాను ధరించుకొనెను ఆతని టోపీబెట్టుకొనెను. ఇపుడాతఁ డబ్దులువలెనే యుండెను. కాని వసనములుమాత్రము రక్తసిక్తములై యుండెను. అతఁడు మరల తాను గొని తెచ్చుచున్న వస్తువును గైకొని బిలములోఁ

ప్రవేశించి గంభీరముగా నాసంకేతము నుచ్ఛరించెను. అంతలో నటకొక ముసుగుమనిషి వచ్చెను. అబ్బులునకాతఁడు సెలాము నర్చెను.అబ్బులాతనిని బిలిచి బిలద్వారము బంధింపుమని యాతని కాజ్ఞయిచ్చి మిగిలినవారెల్లరఁ బిలువుమనెను. ఆతఁడట్లొనర్చెను. రాములు అబ్బులువోలె నటించెను. వెంకటాద్రి తనకు జెప్పిన యనుమానమును వారికి కరువుపెట్టెను. రహీయాబిలములో లేడుకదా. అబ్బులే యిపుడుదానికి యజమానియాయెను. సంకేతిక పదమునూర్చెను. ద్వారసంరక్షణ జాగ్రత యని హెచ్చరించెను.

ఇపుడతఁడొక కుర్చీపై నుపవిష్టుండై వినయులైయున్న సేవకులతో భాషించుచుండెను. ఆభటులలో సోముఁడనువాఁడు చేతులు జోడించి యిట్లుచెప్పదొడగెను. అయ్యా మేము వెంకటాద్రిగారు మాదారి వెళ్లినతరువాత మాధవుని వెదకుకొనుచుఁ బోయి యాగుంట యొద్దకుఁ జేరితిమి. అటవాఁడింకను గుటకలు మింగుచుండెను. వాఁడిని దీసుకొనివచ్చి మన బిలములో నున్న చివరగదిలోఁ బారవైచితిమి. ఆసరయుబాల దానిపీకనులిమినా పాపములేదు. దేవాంతకురాలు మన కామణ్ణి చంపివేసి ఆసన్యాసిగాడితోఁ దప్పించుకొని పారిపోవుచున్నది. మేము మాధవుణ్ణి బంధించి వచ్చుచున్నపుడు మాకు మన బిలద్వారమున వారు కనబడగా పట్టుకొని బంధించితిమి. ద్వారకాపరులకు వాళ్ళు కంట్లో దుమ్ముకొట్టి మనసంకేత ముచ్చరించి పారిపోవఁ బ్రయత్నించారు.

రాములావేశ జనితుఁడైనాఁడు. ఆసన్యాసిని చంపనిశ్చయించినాఁడు. 'మరల బంధించితిరా! ఎచట నాకుఁజూపుడు. అంతసాహసించెనే' అని రాములు కంగారుగా అనెను. వారు యువతియగు సరయూబాలదగ్గర కబ్దులునుఁ గొనిపోవుటకు సందేహించినను ప్రస్తుతమతఁడే యజమానిగా నుండటచేత వారాతని కెదురాడలేక పోయిరి. ఐనను కొందఱు ఆతని ననుమానించిరి. కొందఱాతని ప్రవర్త ననుమానించిరి. మఱికొంద ఱాతని పూర్తిగా నమ్మిరి.



17

దొరబాబు విషాదకులఁ జిత్తుఁడై పోయెను. ఆతని మ
నస్సేమియు స్తిమితముగ లేదు. తానెవరికోసమైవచ్చి, యెవరి
కోసమైయత్నించుచుండెనో ఆతఁడుతనంతతానెదర్శనమిచ్చియుం
తలోనే మాయమగుటచే నాతని దురదృష్టము నాతఁడే నిందిం
చుకొనుచుండెను. ఆసన్యాసికొఱకై కాదా తానటకు వచ్చి
నది. ఆతని కొఱకై కదా తాను హిమాలయ పర్వతప్రాంత
ముల కేగినది. ఈయనయేకదా చితానందస్వామి. ఈయనవల
ననేకదా మాధవుని వృత్తాంతరహస్యము వెల్లడియగును. అట్టి
వాఁడు తనంతతానే దుష్టులబారినుండి తప్పించుకొనియుఁ దా
నెదురగుటచేమరల వారికిఁ జిక్కువడియెను. అందుచే దొరబా
బునకు. బట్టరాని సంతాపము కలిగెను. అతఁడు వెంటనే ధైర్య
ము తెచ్చుకొని వారలనురక్షింప దొరకొనెను. సన్యాసితో
గూడి పరారియగుచున్న యువతి నరిసింహారావు ముద్దులపట్టి
యగు సరయూబాలయని యాతఁడెరుగును. ఆనాఁడు రోజాల
మిల్లునపుడు కదా యాతఁడామెనుఁ జూచియుండెను. దొరబాబు
కర్తవ్యము బిలములోఁ బ్రవేశించుట వారలను రక్షించుట.
ఎటులఁ బ్రవేశించఁ కలుగును. పెక్కులాబిలమును సంరక్షించు
చున్నటుల గ్రహించియే యుండెను. అందుచే నీతఁడాబిలము
న కేదేని మారుమార్గము కలదాయని యాలోచించి యాప్ర
దేశమందలి వెనుకభాగమునకుఁబోయి నచట వెదుకసాగెను

అచ్చటీతనికొక చెరువు కనుపించినది. ఆచెరువే యచటిమెరక భూములకాధారము. అతఁడు పైనుండి క్రిందకుదిగుచుండుటచేత నుయొకరాయి తానునిలుచున్నది దొరిలిపోవుటచేతను నాతఁడాచెరువులోఁ బడిపోయెను. అతఁడుమొద్దునకీదప్రయత్నించెను కానిలోతు యెక్కుడుగ లేమిచే నట్లుచేయలేను. ఆచెరువులో తునకాతనికి చిఱునగవుకూడవచ్చినది. ఆహా! ఏమిచిత్రము. అతఁడు పడినచోటనే కొండలోని కొకసొరంగ ముండినటుల గనుపడుచున్నది. ఆబిలమునుండి నీరువచ్చుచున్నటులుండెను. అదేదియో ప్రయత్నించి కనుగొన దొరబా బుద్దేశించెను. దొరబాబు విశాలహృదయములో ఆశాలత చిగిర్చెను. అతడులోనికి జొరబడ్డాడు పోనుపోను సన్నని దారి కనుపించెను కొంత దవ్వేగినఁ పిదప యచట నీరేమియు గానరాలేదు. దొరబాబు హృదయములో మొలకలెత్తిన ఆశాలత పూవులు వొడగసాగినది. అందుచే యాతనిముఖము కళాపరిపూర్ణ మాయెను. అతఁడువెళ్ళిన కొలది యొకబాట యేర్పడియేయున్నది. అతడువెళ్ళగా నొక చోటనుండి వచ్చెడి మూల్గు వినవచ్చినది. దొరబాబా దెసకై పోయెను. పోయి యాతఁడొక చిన్నని గుట్టచుట్టు తిరిగిపోవు చుండెను. ఇపుడతని కాప్రదేశము నివాసయోగ్యమైనటుల తోచెను. ఇపుడతనికి మూల్గు స్పష్టముగా విన్పవచ్చినది. అటనొక ద్వారముకనుపించెను. దానికి తాళమువైచి యుండెను. దొరబాబా తాళమును చాకుతోవిడగొట్టి లోఁ బ్రవేశించు సరికి మూలుగుచున్నవ్యక్తి యాతనిదృష్టిపథమునఁ బడెను.

ద్వారకాబాబాతనిని జేరి పలుకరించెను. తాను సహాయ్య ముచేయుటకై వచ్చితిననియు తన్ను విశ్వసింప వలసినదనియు నాతఁడా వ్యక్తితో ననెను. ఆవ్యక్తియు మెల్లగా కన్నులువిప్పి 'నేను మాధవుఁడను. బేల్మొరహియా అను దుర్మార్గుని, ఆసన్యాసి నపహరించిన యాదుష్టుని మాయోపాయము వలన నిట్టిఆ గాధములో నేను పడితిని. అని యాతఁడు తాను మోటారును వెంబడించి వచ్చినది మొదలు తానా కూపములోఁ బడినంతదన్క కతన కథను స్పష్టీకరించి యాతనికిఁ జెప్పెను. ద్వారకాబాబాతని సాహసమునకు మెచ్చుకొని తాను చంద్రశేఖరముగారి వలన నియమింపఁబడి మాధవుని యాసన్యాసిని యన్వేషించు చున్న టులఁ జెప్పెను. మాధవుఁడాతృతతో యాసన్యాసియెవరోయని ప్రశ్నించెను. ఆసన్యాసి ఓదానందుఁ డనియు యోగానందుని శిష్యుఁడనియుఁ జెప్పి మిగిలినకథ నపుడు చెప్పనీయకొనలేదు.

మాధవుఁ డాతృతగా మధురకుశలమును కూర్చిప్రశ్నించెనుమధుర కెక్కు-వజబ్బుగానున్నదనియునతనిపై బెంగచేఁగృశించిచనిపోవు స్థితిలో నుండెననియు ద్వారబాబు చెప్పెను. మాధవుని వదన బింబము వివర్ణమైపోయెను. ఆతని హృదయమ్ండలము నిశీధరాత్రి వలె నంధకారబంధురమాయెను. మాధవుఁడు సన్న్యాసినా సంరక్షించలేను. పొంతకునిపట్టు కొనలేకమీదు మిక్కిలితన్ను ప్రాణసమానముగా చూచుకొనుచున్నమధురకు ప్రాణసంకటకుఁడాయెను. ఇవియే అతని విచారములు.

అందుచేతనే యాతఁడు మరింత అస్వస్థుఁడై పోయెను. మరింత బాధపడెను. దుష్టుల నెట్టులేని హాలాహలసర్పఁ దనకుఁ దానె పురిగొల్పుకొనెను. దొరబాబు చేయూతనీయ లేచి యతనితో గలసి పరారి యగుటకు సిద్ధుఁ డాయెను. వారట్లు బయటకు వచ్చునప్పటికి వారికొక వ్యక్తి కంటఁబడెను. ఆతఁడు వీరలను చూచెను.



## 18

వెంకటాద్రికి నిద్రపట్టలేదు. అతని కెందుకో ఒకవిధమైన భీతి పుట్టినది. అతఁడు బొమ్మారిమెట్టకై ప్రయాణమాయెను. రెండు పిస్తోళ్ళను నవవరించుకొని జేబులం దుంచుకొనెను. అతఁడిపుడు మోటారుపైఁ బోవుచుండుటలేదు. కాలినడక నడ్డదారిని బొమ్మారిమెట్టఁజేరెను.

అప్పటి కప్పుడే రాత్రి రెండుగంటలైనది. వెన్నెలగొద్దిగా వచ్చినది. అతఁడు బిలద్వారము సమీపించుచుండెను. ఇతని కెదురుగనే పెద్దరాయిఁ గలదు. ఆరాయిదరినే నేదియోవస్తువు నీతఁడు చూచెను. ఈతఁడావైపునకేఁ గదిపోవుచుండెను. దానిని సందేహించి పరీక్షించెను. అది యొకవ్యక్తని గ్రహించెను వెంటనే పిస్తోలుతీసి గురిపెట్టి యావ్యక్తిని కదలిచూచెను. ఆవ్యక్తి కదలకుండుటచూచి సందేహముతో బరీక్షించు తరి యావ్యక్తి మరణించెనని యీతనికి బోధపడెను. ఆదెవరో కాదు. అబ్బులే. అతఁడు అబ్బులును గుర్తించెను. వెంకటాద్రికి బ్రైపాణములు పైనయెలగిరి పోయినటులాయెను. పెద్ద మోసమేదియో జరిగి యుండునని యాతఁడు నిశ్చ యించు కొనెను. అబ్బులు మామూలవేషములోఁ గూడలేదు. ఇపుడాతఁడు చేయవలసిన పనియేమి. శత్రువుల నెదుర్కొనుట యాపరారి యగుటయాఁ ఏదియుత్తమమో యాతనికి దోఁచుటలేదు. సాహసించి యాతఁడు బిలములోఁ జొచ్చుటకు సిద్ధపడెను. అతనికి పుడమ

గునకుఁ బ్రాణభయముగనే యుండెను. లోఁబ్రవేశించి నంతనే యేమిమూడునో తెలియదు. ఐనను వెంకటాద్రి యంతపిరికి వాఁడు కాదు. బిలద్వారమును తెరిచెను. లోనకుఁ దొంగిచూచెను, లోఁబ్రవేశించెను. సంకేతము నుచ్చరించెను. ఆసంకేతము వినగనే యనుమానాస్పదులై ద్వారపాలకులు తమ రహస్యములనుండి వెలువడి నిశిత కరవాలములతో బ్రత్యక్షమైరి. వారట్లు హఠాత్తుగా విచ్చుకత్తులతో వచ్చుటచే జాగ్రతలో నున్న వెంకటాద్రి పిస్తోలు గురిపెట్టెను. ఆ దొంగలు తమపై పిస్తోలుగుండిపెట్టెనేవఁడో యని వెరగంది వెనుకకు తగ్గిరి. మరు నిముసముననే యొకరి నొకరు పోల్చుకొనగలిగిరి. వెంకటాద్రి పాదములపైఁబడి వారు క్షమించమని ప్రాధేయపడిరి. వెంకటాద్రి తొందరగా వారినిఅబ్దులు రాకనుగురించి యడిగెను.వారు అబ్దులు వచ్చెననియు సోముఁడు వానిని సన్న్యాసి యున్న గది లోనికిఁ దోడ్కొనిపోయెననియుఁ జెప్పెను. వెంకటాద్రి 'అయితే త్వరగాపదండి వాఁడు దొంగ ముండాకొడుకు. అబ్దులును చంపివేసి ఆవేషంలో సంచరించుచుండెను. ఈపాటికిఁ వాఁడు బంధితులను తప్పించుకొని పోయియేయుండెనేమో' అని బిర బిర సావిడిలోనికిఁ పోయి ఆటగంట మ్రోగించెను. దొంగలు వచ్చిరి. వెంకటాద్రి వారికీసంగతి క్లుప్తముగా చెప్పెను. వారితోనాతఁడా సన్న్యాసిగదికి అబ్దులుపై పోవుచుండెను.

—o—

# 10

రాములు సోముణ్ణి తీసుకొని సన్న్యాసిని బంధించిన గదిలోనికేగెను. గదిద్వారము తీయుసరికి నటుయిటు పచారు చేయుచున్న నొక వ్యక్తి కనఁబడెను. అతఁడెవరు?సన్న్యాసి. ఆసన్న్యాసిని చూడఁగనే రాములుకుఁ బ్రీతి యంగము నుండియు నుద్రేక ముప్పొంగినది. తనతండ్రిమనస్సును బాధించిన దీతఁడు కాఁడా? తనతండ్రిమట్టిపెట్టుమని కోరినదీతనినేకదా. ఈతని వలననేకదా తనవంశముకీర్తియుకూడపోవునని నగిసింహారావుచెప్పెను. అట్టిదుష్టుని కపటసన్న్యాసిని చంపెదననికదా యతఁడుఘోరప్రతిజ్ఞ చేసెను.ఆతడు క్రోధావేశ వివశుఁడై కేవలము భయంకరమూర్తియై, పితృవాక్ పరిపాలనా దురంధరుఁడై సమాయాసమయము లనోదింపక తన్నుఁదా మరచిపోయి ఆసన్న్యాసిపై పాణిని విసరివైచెను. ఆగదిలోనే యొకమూలఁ గూర్చుని యేదియో తదేక ధ్యాన్నముతో నాలోచించుచున్న సరయూబాల ఆయాగంతకుని రాకఁ గని వాఁడు తనకరవాలము నాసన్న్యాసిపై విసర నుద్యుక్తుండౌట తటాలున అడ్డుగావచ్చినది.ఆసన్న్యాసిని ఖడ్గపు బారినుండి రక్షించిన యాపరోపకారిసరయూబాల సన్న్యాసికి మారు తానే దాని బారికి గురియయ్యెను. ఆసన్న్యాసియు కరవాల ప్రవాహముచేఁ గ్రిందకుఁ గ్రుంకిపోవుచున్న సరయూబాలను లేవనెత్తి నామెను తనభుజము పై వైచుకొని మహాదుఃఖము పొందెను. ఈవిపరీతము వింతగా చూచుచున్న

రాములు తనకత్తిపోటుకుఁ గురియైనది. యెవరాయని పరికించి తనతోఁబుట్టునగు సరయూబాలగా గ్రహించి నిశ్చేష్టితుఁడై మొనలేని చింతాగ్నిజ్వాల హుతుఁడై దురపిల్లుచుండెను.

'ఆహా యేమి యీపాపకృత్యము. నాప్రియసోదరిని మర్కటూరు బారిని పడనేసితినే! ఇంతటి ఘాతకుఁడెచ్చటైన యుండునా' అని చింతించి దుఃఖ పూరితములైన యశ్రువులతోఁ దిరిగిపోవుచున్న తలతో, దూలిపోవుచు ద్వారబంధమును పట్టుకొని నిలువఁబడెను. అంతలోఁ అతనికి పదధ్వని వినరాగ యెవరాగ యెవరాయని యని పరికించి వెంకటాద్రి భటాళితో వచ్చుచుండుట గాంచి మరియొకవైపుగాఁ బరువెత్తసాగెను. సోముఁడా ఆగంతకులను కలసుకొనెను. వారీతనిని తరుముచుండిరి. వెంకటాద్రి 'ఆగుము. పరుగెత్తితివా నీతలఁ బగులు' నని గర్జించెను. రాము లపుడేయొక మలుపుఁ జాటుసడాగి యటనుండి వెంకటాద్రిమొదలగువారిపై పిస్తోలు పేల్చెను. అందులో నొకఁడు పడిపోయెను. వెంకటాద్రి కపాయము బోధపడెను. తోడనే అతఁడు నాతనిపై రివాల్వరులను వియోగింప నాజ్ఞాపించెను. రాములు కధైర్యము హెచ్చెను. సోదరి యాతని వలననే యీగతికి వచ్చినది. సన్యాసి గతించలేదు. వెంకటాద్రి తనను పీడడని బాగుగా నెరుగును. ఇంతలో నాతఁడొక పిస్తోలుగుండుకు బారియయ్యెను. అతఁడు వెంటనే తన యొద్దనున్న వసువ అదియే డెనో మానంటించెను. ఈలోపున వెంకటాద్రి వ

గైశాలాబ్రిదేశమునకు వచ్చిరి. వెంకటాద్రి మోసముగ్రహించెను. ఏమిచేయుటకుఁ దోచక కొంతసేపుగంగారుపడి యాడైనోమా నార్పివేయ నాతనిపై లంఘించెను. అతఁడట్లుచేయునేమోయని తలంచిన రాములా డైనోమాను దూరముగ విసరివైచెను. ఇంతలో డైనోమా పూర్తిగా యంటుకొని పెద్దధ్వనితోఁ బ్రేలినది. వెంటనే యాకొండ కూలిపోయినది. కొండంతయుఁ బొగమంటలచే నిండిపోయెను.



పదముల సవ్వడికాగా రాములు సోముఁడు పరుగెత్తిరి ద్వారములు తెరచినవి తెరచినట్లే యుండెను. అందుచే వెంటనే సరయూబాలను భుజముపై నిడుకొని సన్యాసి బయటకు వచ్చెను. సరయూబాలతో ద్వారమువైపుఁ బోవక మరియొక వైపునకు శర వేగముగా పరుగెత్తెను. ద్వారముయొద్ద యిట్టి హడావిడిలోఁ దప్పక కాపాలవారుందురు. కనుక పారిపోవుట దుర్లభము. ఏదోవైపునకుఁ బారిపోయిన తప్పించుకొని పోవుటను వీలుండునను నాశతో కతడటులు పరుగెత్తెను. పరుగెత్తి కొంతదూరము వెళ్ళునప్పటి కిద్దరు వ్యక్తు లెవరో తలుపుఁదీసుకొని బయటకువచ్చిరి. వారిద్దరినిచూచి, సన్యాసి భయపడెను. కాని ఇద్దరును వీరి నెఱుగున్నటుల మాటలాడసాగిరి. తాము వారికి హితులమనిచెప్పిరి. వారిద్దరెవరు?

దొరబాబు—మాధవుఁడు.

సన్యాసి—వెంటనే త్వరపడ వలయును. వారు మమ్ము తరుముకొని వచ్చుచున్నారు. అని ముందుకుఁ బరుగెత్తసాగెను. దొరబాబు మాధవుని చేయిపట్టుకొని యతనితో సహా బిలము వైపుకుఁ బరుగెత్తెను. సన్యాసియు దొరబాబు సహాయ్యమున బిలము వెలుపలకు వచ్చెను. అపుడే సరయూబాలకుఁ స్పృహ కలిగినది. మాధవుడేదియో జ్ఞాపకము తెచ్చుకొని మరచిపోతిని. ఆ వెంకటాద్రి మున్షీక స్త్రీనిబంధించి యుండెను. ఆపెను

రక్షించుట మన బాధ్యతకాదా?' అనెను. సరయూబాలం దానొక కాంతను మృతినొందిన దానిని చూచితిననియు నామెయే మాధవుఁడు చెప్పిన కాంతయై యుండుననియు వారితోననెను సరయూబాల సోదరుఁడగు రాములును గుర్తించకపోలేదు. ఆతఁడు మారువేషమునచటకు వచ్చెననియుఁ దమ్ము రక్షించునని యునివ్వెఱపోయిన యామెకు రాములు విపరీతపుఁజర్యకూయాశ్చర్యము కలిగించెను. ఐనను నామెయిపుడా రాములును గుర్తించియే యోచించుచుండెను. ఆతఁడు తప్పించుకొనుటెట్లు. వారినాతని దప్పింపుడిని ప్రార్థించుటెటులు, ఆమె తన బాధనుకూడ సహింపలేకుండెను. వారందరిపుడా చెరువులోనికి వచ్చిరి. అపుడే పిడుగుపడినటుల గొప్పధ్వని యాయెను. కొండకూలిపోయెను. వీరిలోన యున్నచో వీరుకూడ మరణించియే యుందురు కదా. పాపము గృహాలోని వారందే మడసిరి.

ఎల్లడల పొగగ్రమ్ముకొనెను. కొద్దికొద్దిగా ఆ గృహాలోచుండి బయటకు వచ్చుచుండెను. వారంద రొడ్డునకుఁ జేరుకొన్నిరి. అచట పొగబాధ పడలేక మరికొంతపైకి పోయిరి. సరయూబాల మరల వివర్ణయై పోయెను. ఆమె సోదరుఁడిక లేడా? ఆమెకల్లే తోచెను. తోచుటయేల నల్లేజరిగెను. సరయూ మరల మూర్ఛ మున్గెను. ఆమెను దొరబాబు జేతులపై నెత్తుకొనెను.

దొరబాబు మొదలగువారు లోన డైనోమాప్రమాదమువల్లనో ఎందుచేతనో అండ కూలిపోయిన దనియు నందుచే

లోనున్నవారు లోనే మడసిరనిరయు గ్రహించిరి.

వారు మెల్లగా రాజమండ్రి త్రోవఁ బట్టిరి. అంతలో మాధవుఁడేదియో గుర్తించి "అదిగో ఆతఁడె బెల్మెరహీయా అనువాఁడు. వీఁడింకను జావలేదు కాబోలు. పట్టుకొనుఁడ" నెను. మాధవుఁ డీపుడు సరయూబాలను గైకొనెను. దొరబాబు సన్న్యాసియు నాతఁడు చెప్పిన రహీయాను గాంచి పరుగెత్తిరి. వాఁడింత దనుక తనదుర్గము గతికాంచుచు పరాకుగానుండెను. వెంటనే వాఁడు తనకై వచ్చుచున్న వాడు వారిని గ్రహించి పారి పోయెను దొరకలేదు. వాఁడంతు లేకుండ బోయెను. జిత్తులమ్మారికదా వాఁడేమయ్యెనో! దొరబాబు సన్న్యాసి తిరిగి మాధవుని కలసుకొనిరి. అప్పటికప్పుడే తెల్లవార జొచ్చెను. వారు రాజమండ్రి జేరుకొని పెద్దస్టేషనువద్ద జట్కాబండ్లు కట్టించుకొన్నిరి. దొరబాబు మాధవునితో మాధవా నేను పోలీసుస్టేషనునకుఁ బోయి రహీయాను పట్టుకొను ప్రయత్నములు చేయించెదను. ఇపుడువాఁడుమనకుదొరకకున్న వాడికచిక్కుటకష్టము. స్వామీ మీరు మాధవునితో చంద్రశేఖరముగారింటికి దయచేయుఁడు.

"ఆ ఏమి! చంద్రశేఖరముగారా! కలక్టరుగారేనా! అట్లయిన ధన్యుఁడను. అందుకొఱకే ఇక్కడకు వచ్చితిని. ఆయనతో మాట్లాడవలయును. ఐతే ఇపుడు నేను మీతోనే వచ్చెదను.' అనెను. చంద్రశేఖరముగారింటికొక బండిపై మాధవుఁడు సరయూబాలను గొనిపోయెను. మఱియొకదానిపై దొరబాబు ఆసన్న్యాసి పోలీసుస్టేషనుకుఁ బోయిరి.

—♦—

'అయ్యా మీరు చిదానందస్వాములుకారా?'

సన్యాసి చకితుఁడై దొరబాబుతో నిట్లనెను. 'చిత్రము. మీకెటులఁ దెలియునండి'

దొరబాబు—ఆ సరయూబాల యెవరో మీకుఁ దెలియునా?

సన్న్యాసి—నాకెట్లు తెలియును. నేనపుడే యాప్తులను వీడి ఇరువదిరెండు సంవత్సరము లైనది.

దొరబాబు—నిజము. ఆ సరయూ మీకుఁ గోమరిత యగును.

సన్న్యాసి—నాకా. అదెటులు నాకుఁ గుమార్తెలుఁ లేరే!

దొరబాబు—అనగా మీతోడల్లుని తనయ.

సన్న్యాసి—అయ్యా మీరెవరు. మీపల్కులు నాకర్థముకాలేదు.

దొరబాబు—నేను దొరబాబు అనే పత్తేదారుణ్ణి. మీరు పెద్దలడిగారు చెప్పవలసి వచ్చినది. సరయూబాల మీవసతి యత్తగారైన సుందరమ్మ మనుమరాలు.

సన్న్యాసి—నరిసింహారావు కుమార్తెయా

దొరబాబు—చిత్తము.

సన్న్యాసి—రామారావో! ఆమె సోదరుఁడా!

దొరబాబు—చిత్తము.

సన్న్యాసి—పాపము! నరిసింహారావిపు డెచట నుండెను.

దొరబాబు—ఈయూరనే.

సన్న్యాసి—నాకాతని చూడ కుతూహలమగుచున్నది ఎందుకులెండి.

దొరబాబు—అట్లనెదరేమి? మీకు సహోదరుఁడు కాఁడా ?

సన్న్యాసి—అవునప్పా. నేను విరాగిని. నాకిక బంధు కోటితో నేమిపని.

దొరబాబు—అదియటుంచుడు. ఆరాత్రి మిమ్ములను పిస్తోలుతోఁ గొట్టినదా నరిసింహారావు మిమ్ములను సంరక్షింప బోయినది మాధవుఁడు.

సన్న్యాసి—అటులనా! రామారావు నన్ను వధింప బ్రయత్నించెను.

దొరబాబు—వారికి మీపై ఏదియో పెద్ద కోపముండి యుండును.

సన్న్యాసి—మావృత్తాంతములన్నియు నెరిగినవారివలె మాట్లాడుచున్నారు.

దొరబాబు—ఇంతవరకే మీశెలవైన నాకుఁ దెలిసిన దింకకొంత చెప్పెదను ఆపైనమీరు మీవృత్తాంత మామూలా గ్రముగా వినఁగోరెదను.

సన్న్యాసి —

దొరబాబు—రాజామణిని మీరు ప్రేమించిరి. సుందరమ్మ రాజామణిని నరసింహారావునకిచ్చి వివాహము చేయ నిశ్చయించెను. కాని రాజామణి యా సంబంధమున కియ్యకొన లేదు. సుందరమ్మ బలవంతము చేసెను. రాజామణి మీతోఁగలసి బెజవాడ వచ్చివేసెను. మీకు మీగృహమువద్దనుండి ధనమువచ్చెడిది. దానితో మీ రుభయులు సుఖముగా నుండెడివారు. కొంతకాలమునకు మీకొక మగశిశువు కలిగెను. ఒకనాఁడు మీరింట లేనిసమయమున రాజామణి యగస్మాత్తుగ చనిపోయెను మీరు తిరిగి సదనము చేరుకొన్నతరి పిల్లవాఁడు మంచముపై గోలపెడుచుండెను. అతన్ని తీసుకొని రాజామణిని పిలుచుచూ మరియొక గదిని జేరితిరి. దానిలో రాజామణి మృతి నొందియుండెను. అపుడుమీకుమతిపోయినది. దుఃఖించుచుండిరి. ప్రపంచక మంతయు సూన్యమని తలంచిరి. బ్రతుకుపైనసహ్యత జెందిరి. ఆత్మహత్యకు సిద్ధపడిరి. యోగానంద స్వా .. లు. నీతిదాయకమైన మాటలతోమిమ్మునోదార్చి మిమ్ములనాతఁడు తన మఠమునకుఁ గొంపోయెను. మీపిల్లవానిని తల్లివలె నాతఁడు చూచెను. ఆయన తలచుకొన్న మీకేదిలోటు. మీకెందరో ఉపచర్యలు చేసెడివారు. ఆయనకు మీతో ముందుఁ బరిచయముండెడిది. మీయిద్దరి యమోఘమైన ప్రేమ నాతఁడెరుగును. కొన్ని నెలలు మీకు వేదాంతరహస్యము భోధించినతరువాత మీరు రాజామణిని తలచుట మానివైచిరి. మీ కుమా

దుష్టియందుకూడ మీకు విరక్తి పుట్టినది. ఆనందస్వాములు ఆ బిడ్డని కొనిపోయి నేరికో యిచ్చివేసెను. ఇంతవరకు —'

సన్యాసి—సత్యము. స్వాములు పరమపదించిరి. మేము హిమాలయములపై కుటీరమునం దుండువారము. ఆయన మరణించుసమయమున నన్నుదరికిబిలిచి నన్నొకసారివెళ్ళి నాకుమారుని కను గొనుమని చెప్పెను. 'అతఁడు యావనుఁడై సకలభాగ్యభోగ్యములు పొందుచుండును. అతనికి దరిద్రము లేని లోటుండదు.' అని నన్ను ఈ రాజమండ్రిలోఁ గలక్టరుగానున్న చంద్రశేఖరుగారి వద్దకు నన్ను వెళ్ళుమని చెప్పిరి. ఆయనపుడు రహస్యముగా పొందుపరచిన ఒకమణి—ఇదిగో—

దొరబాబు—ఏమి దీనిప్రకాశము! దేదీప్యమానముగ నుండెనే!!

సన్న్యాసి 'ఇది సాటిలేని వెలగలమణి. దీనితో ఎన్ని యూళ్ళుకొన వచ్చును. ఇదిగొనిపోయి నాకానుకగా నాతని కిచ్చిరమ్ము.' అని సెలవిచ్చిరి. సనివినితిని. నేను రాజమండ్రి జేరితిని. ఈమధ్య యాత్రలన్నియు సేవించుచు వచ్చితిని. ఇచట నాకు వారియిల్లు తెలియుటెట్లు వాకబు చేయవలయునుకదా? ఆరాత్రి పది పదకొండుగంటలకు గోదావరీ వంతెనయొద్దనుండి కోటిలింగస్థానముననున్న మఠము చేరబోవు చుంటిని. అపుడు నన్ను పిస్తోలుతోఁ గొట్టిరి. నకీ గృహాలో స్పృహాకలిగెను. సరయూబాల నన్ను తప్పించ ప్రయత్నించెను. అది విఫలమొనది.

ఇపటి కప్పుడే బండి పోలీసుస్టేషను జేరుకొనెను. దొర బాబు రంగాచారికిఁ దక్షణము కబురునంపెను. ఇన్స్పెక్టరు గారు వచ్చిరి దొంగనుబట్టుకొను విషయమై చాలసేపు నాలోచించిరి.

ఐతే సన్యాసిమాధవునిగూర్చి ప్రశ్నింపలేదేమి? అతఁడు మాధవుని ముఖలక్షణములను బట్టియు కంఠస్వరము స్వాభావము చేష్టలు మొదలకు వాని బట్టి తన కుమారుఁ డనియే నమ్మెను. కాని సందేహముమాత్రి మాతని వీడిపోలేదు. దొర బాబు నడిగిన యాతఁడు తెలియదన్నను కాదన్నను తాను సహింపరాని వేదన యనుభవింపవలసి వచ్చెను. ఉదయముననే చంద్రశేఖరముగారినే యడిగి తెలుసుకొన నాతఁడు నిశ్చయించుకొనెను.

మరియు నాతఁ డీలోపున నరిసింహారావును చూడ సంకల్పించుకొనెను.

ఆ సన్న్యాసి నామము కూర్మనాధరావు. కూర్మనాధ రావిపుడు మనుపటివాఁడు కాదు. శాంత స్వభావుడు. ఆతఁడు నరిసింహారావుకు నిదివరకే క్షమించి యుండెను.

—౧—

బండిలో సరయూబాల యింకను మగతయందే యుం డెను, శకటము రయముగ పోవుచున్నది. మాధవుఁడు నిజదేశ మును మరచిపోయెను. మధువుగురించియే యాలోచించుచుం డెను. మధుర మాధవు నెంతగారవముగ చూచినది. "ఆరిందా' వలె పెంచినదే? అట్టిపే)యసి నీతఁడు నిర్లక్ష్యం చీవిధముగా కాంధిశీకుఁడు కాకయ దిరుగు చుండెను. ఆమెకుఁ తనవలననే కదా ఇట్టి వుపద)మైన జ్వరముచే పీడింపఁ బడుచున్నది. మధు రకిపు డెటులున్నదో కదా? ఆమె తన్నేవిధముగా భావించెనో కదా? ఆనాఁడు తాను లీలతోఁ బోవుచు మధురకుఁ గనపడ కుండ నుండ యత్నించెనే. దానికి మాధవుఁడు తొలుత సిగ్గు పడినను ఇపుడు విచారించుచుండెను. ఆమె రూపలావణ్యము సుగుణసపంత్తి పే)మమహిమ తలచుకొన్నకొలది కడుపుచెరు వైపోచున్నది. ఏమిచేయును. మాధవునకుఁ మధుర లేనిలోకము మధుశూన్యమేకదా? ఆతని నాదరించువారెవరు ఎంత పెంకిత నముగానున్న నాతని పట్టుదలలను చెల్లింపఁ బ)యత్నించెడి వారెవరు. అతనిని మృదువుగా చెక్కిళ్ళను గిల్లి మందలించు వారెవరు. చిన్నప్పటినుండి తానేరితో నాటలాడుకొనియేరితో పెరిగెను. దాకల మూచీలు నాడుకొనుపపుడు వారెంత ముచ్చ టగ నుండువారు. మధురయే దొంగయైనపుడు ఆమెగంతలు కట్టుకొని కొంతసేపు మాధవునికొరకు తడుములాడి తుదకేది

డుా తగిలి పడిపోయినటుల నటించి క్రిందపడి నపుడు మాధ
వుఁడు 'ఏం' అనుచు దరికి రాగ 'దొంగతివా దొంగవు' అని
గళాలున పట్టుకొనిగంతలూడదీసుకొని సఫలీకృతమైనట్లు నవ్వి
డిదే ఆనవ్వెంతమంజులము.ఒకొప్పు నాటకము వేయుదమని ఆ
యాపాత్రలునటించుచూ ఉన్నపుడువయ్యారముగా త్రిప్పుకొను
చు'ఓతీవానీవునాతోనభినయము చేయఁగలవా?ఓపుంకోకిలా స్త్రీ
నైననన్ను సంగీతములో నెగ్గగలవా?'అనిఅనేటపుడు ఆమెనయ
నములందెంత సోయముగనుండెడివి. ఆమె వ్యాకయు మెంతప
విత్రమైనది. అట్టి రుధురమాధవునకుఁ దక్కునా! ఆమె కపోల
ముల స్వాదు మరంద మేకద మాధవునకు జీవనాధారము.

మాధవుఁడు చిన్ననాటి చర్య లన్నియుఁ దలచుకొని
మనస్సంతయు కలత పెట్టుకొనుచుండెను. అతఁడు దుస్సహాలే
దనపడుచుండెను. అతని బాహ్య ప్రపంచజ్ఞానమే దుఃఖవారా
సిని మునిగిపోవుటచేఁ గాబోలు సరయూ స్థితియు సదనముజే
రుకొన్నదికూడ నాతనికిఁ దెలియలేదు. తమసౌధమును తాము
జేరిని సంగతి బండివాఁడు చెప్పగా నియమితస్థానమునకు జ్యో
తిమని తెలుసుకొని బండివానిని డబ్బుల కుదయము రమ్మని
పంపివైచి సరయూబాల హస్తముల పైననే లోనికిఁగొనివచ్చి
సావిడిలోనున్న సోఫాపైఁ బరుండజేసెను.

అప్పటికి ౧ గంటలయినది సౌధమంతయు నిశ్శబ్ధముగా
నున్నది. విద్యుక్తి దీపములు వెలుగుచుండెను. కాని యేమియూ
వింత యేమిఘటిల్లినది. ఆ ని శ్శ బ్దా ర్ధ మే మి. భీతతనంత

త్తానే యత్నిలోఁ బుట్టెను దేహమెల్లఁ గంపింపసాగెను. ఈ భయమునకుఁ గారణమేమి? ఏల నౌకరులందరు గాఢనిద్రా పరవశులై నియమిత స్థానములనువీడి ఎక్కడపడిన నక్కడే పరుండి యుండిరి. తలుపులన్నియు నట్లేలఁ దీసియున్నవి? మధుర సుఖికదా? అని తర్కించుకొనుచు మాధవుఁడు మెల్లగా సౌధము నధిరోహించి శయనమందిరమందుఁ జొచ్చెను. ఆగది ద్వారములుకూడ తీసియేయున్నవి. వంటచేసే రావుడు మంచ ముదరిగా క్రిందపడున్నది. అచట పడకకుర్చీలో ముసలివారగు చంద్రశేఖరముగారు నిద్రపోవుచుండిరి. వారందరెంతసుష్కించిరి. ఇంత నిద్రలో నుండుటకు వీరలింత వరకు మేల్కొని యుండిరా!

మాధవుఁడు మెల్లగా మంచముదరిజేరి చూసెను. మధు మధుర నిద్రించుచుండెను ఆ ప్రణయ తపస్విని నవసిపోయెను. మధురనుచూడగానే యాతని మేనెల్ల చెమ్మగిల్లెను కనులనుండి బొటబొట నీరు కారెను. మధుర ఇకతనతో మాట్లాడునా మధుర ముఖమువైపు తదేక ధ్యానముతోఁ జూచెను. ఇక చూడలేక పోయెను. ఆమెను పిలువఁ దలంచెను. కంఠము గద్గద మయ్యెను. నోటమాట రాలేదు. ప్రయత్నించియాతఁడు మెల్లగా 'మధూ' అనెను. మధుర పలుకలేదు. అతఁడు మధూ మధూ యని పిలుచేచునే యుండెను. ఆవ్యక్తి కదలి నటులయినది మధుర యొక్కపరి 'జీవనపతీ' అనెను. మాధవుఁ డానందముచే నున్మత్తుఁ డాయెను. కాని యామె అట్లు పలువరించెనని

తరువాత గ్రహించెను ఆతని హృదయము వివర్ణమై పోయెను
అతఁడు మెల్లగాపిలుచుచునే యుండెను ఆతనియందే మగ్నమై
యున్న మధుర కా కంఠస్వరము వినుపించినది ఆమెకు మెలు
కువఁ గల్గినది. ఆమె కంగారుతోఁ గన్నులు తెఱువఁ బ్రయ
త్నించెను. మరల మరల మాధవుఁ డామెను పిలచెను. ఇపు
డామె బలవంతముగా కన్నులు విప్పుకొని మాధవునిచూచి ఆ
తనిపై దృష్టి నిగిడ్చెను. తనదివ్యమూర్తి కప్పటికి దయకల్గెను.
ఆమె దార్డ్యహీనయై కాకున్న లేచి యాతనినధికముగ గౌర
వించియుండును. మాధవుని విశాలాక్షులు నీరములతోనిండెను.
కవోష్ణబిందువులు రాలెను. అతఁ డిపుడొక ప్రక్కబల్లపైనున్న
పాలుగ్లాసు తీసుకొని యామెకు చెంచాతోఁ (spoon) పట్టిం
చెను. ఆమె దానినిఅమృతమువోలె గ్రోలెను. కొంతకాలము
గడచినది. ఆమె మరల కనులను విప్పెను. ఎదుటతన మాధవుఁ
డబలవలె రోదనము సేయుచుండెను. ఆమెయాతనిని కనుసొం
జ్ఞల మందలించెను. అతఁడు తన చిన్నిరోదమును మాని ఆమె
యేమి కోరుచున్నదో యని దరిగా మోమునుంచి యామె
యాజ్ఞలకై వేచియుండెను. ఆమెయు మూసిన నయనముల
మరలవిప్పి నేదియోఁ బలుకఁ బోయెను. తుదకుఁ గష్టముపైన
'బావా! వచ్చితివా!!' అనెను. మాధవునిగుండె ఝల్లుమనెను.
ఆతని కెక్కడలేని దుఃఖము వచ్చెను. మధురయిక మాటలాడ
లేకపోయెను. మధుర మరల నిద్రించెను. ఇపుడామె సుఖనిద్ర
నే చెందుచుండెను. ఆమెకు జీవింప నాశకలిగెను. ఆమె నిద్ర

లోనే తన్ను బ్రతికింపుమని వేల్పులను వేడినది.

ఇంతలో రావుడు లేచెను. మాధవునిచూచి 'వచ్చితివా నాయనా' యని వెఱ్ఱికేక వైచెను. ఆమె కేకకు చంద్రశేఖరముగారు లేచిరి. ఆయన మాధవుని చూచిరి. విచారమైన చూడ్కులతో నాతని చూచిరి. ఆయనవ్వ కాతని దరిజేరి మస్తకము దువ్వి మధుర జ్వరతీవ్రతను చెప్పవలెనని తలచెను. కాని ఆయ నటనుండి లేవలేక పోయెను.



# 23

రాత్రి పదకొండు గంటలైనది. అంతయు నిశ్శబ్ధముగా నుండెను. అప్పుడు చీకటికూడ నుండెను. దానవాయి గుంటలో నెక్కడో దూర దూరముగ నంకుటచే బిక్కుబిక్కు రనుచుం డెను. చంద్రమౌళి మహాలలో ఒకపురుషుఁడు దీర్ఘనిశ్వాసంబు లను విడుచుచు నా నిశ్శబ్ధమునకు భంగము కలిగించుచుండెను. అతఁడిపు డావేశపూరితుఁడై యుండెను. విపదంధకారమధ్యమునఁ జిక్కడిన వాఁడువోలె దురపిల్లు చుండెను. అతఁడు సౌధాంత రాళమున నిటునటు గుప్పిమ్మరుచు మర్మభేదనంబగు బాధనొం దుచుండెను. అతఁడు పిచ్చివాఁ డయ్యెను. ఆతనిహృదయ మీా విధముగా నాందోళన పడుచున్నది.

ఆహా! రాజామణి నతఁడేలఁ ప్రేమించెను. ఆమెకూడ నతని వలపులలో నేలఁ జిక్కుకోవలయును. మాసుందరమ్మనా కామెను వివాహముచేయ నేల పట్టుపట్టి యుండవలయును. రాజామణి యాతనితోఁగూడ వెళ్ళిపోయినపిదప నేను సుఖ ముగా మాధవరావుగారి యల్లుఁడనై జమీా యజమానుఁడనై యుండేవాఁడిని కదా. నాకెందుకీఁ గామోద్రేకము కలిగెను. కలి గినఁ గలిగెను. బెజవాడ నేనేలపోతిని. రాజామణి నేల చూచు టకుత్సహించెను. సిగ్గువిడిచి న్యాయమునుమరచి ఆమెను నేనేల చెరపట్ట సాహసించితిని. ఆమె శస్త్రి చూచి యంత భయకం పిత కానేల. అది ఆమె హస్తమునకుఁ దగలనేల. అదివిషలిప్త

మైయుండి యామె ప్రాణిని గొనసేల. ఈసన్న్యాసి యతఁడు కాడా? ఇపుడేలవచ్చెను. మాసిపోయినసేరము పైకుబుకునా? వచ్చినయెడల నాకును నాబిడ్డలకును గతియేమి. మాగౌరవము మే మెట్లు కాపాడుకొందుము. ఛీ ఇదంతయు కర్మము. చేసిన దనుభవింపక తీరునా. ఆసన్న్యాసి మరణించి యుండ లేదు. ఆ రహియా నాపై నెంత కుట్రపన్నెను. ఆవెంకటాద్రి ఎంతటి ద్రోహి. గుండెలవియుచున్నవి వాడెంతసాహసుఁడు.



నరసింహారావు వింకను తచ్చాడుచుండెను. ఆతని హృదయవేదన యంతకంతకు హెచ్చుగుచుండెను. రాములు జాడగాని సరయూసంగతిగాని తెలియలేదు. సన్న్యాసియే జీవించి యున్న తనగతి యెట్లు మారునో యతనికి బాగుగా తెలియును. ఆతఁడు గంటలు లెక్కించుచుండెను. ఒకటి, రెండు, మూడు, నాల్గుజాములుకూడ గడిసిపోయెను. ఆత డిపుడొక లేఖను రచించి డ్రాయరుపైఁ బెట్టియుంచెను. భళ్ళున తెల్లవారినది. మహలులోని కెవరోఁ బ్రవేశించు చున్నటులఁ జప్పుడైనది. వారెవరో యతఁడు పరీక్షించెను. మరల ఆసన్న్యాసియే! ఆతని వదనమే అది పూర్వమువలె ఇపుడుకూడ ఆనందామృత కళాపరిపూర్ణ మైనట్లతనికిఁ దోచినది. అదిచూచి యాతఁ డోర్వలేక పోయెను. వారంత నిర్భయముగా తనమహలులోనికిఁ బోరబ

మంటచేఁ గృద్ధుఁడాయెను. అతని కేసువు పొరబడెచ్చెను. అంత లోకము లేదియో నిశ్చయించుకొని తనగదిలోనికి పోయి తలుపులు వేసికొనెను.

* * * * *

తెల్లవారినది, దొరబాబు చిదానందస్వాములు జట్కాపై దానవాయిగుంట జేరుకొనిరి. వారిద్దరు లోనికిఁ బ్రవేశించిరి. వారు సౌధోపరిభాగమునకుఁ జొచ్చిరి. వారు [illegible]ను నరసింహారావున్న గదిలోఁ బ్రవేశించిరి. నరసింహారావు పాన్పుపైఁ బరుండియుండెను. వారిద్దరు నతని దరికిఁ బోయి లేపిరి. అతఁడు పలుకలేదు. వారు కంగారుతో నతనిని తిలకించిరి. నరసింహారావు శ్వాసలుడిగియుంట వారు కనుఁగొనిరి. అతఁడు ఆత్మహత్య యొనరించుకొనెను. చిదానందులు దొరబాబు మిగుల దుఃఖించిరి. ఆతనిని చిదానందులు తనహస్తములతోఁ దాకుచు పూర్వపుసంగతులను తలపోసుకొని దురపిల్లుచుండెను. అంతలో నాతనిచేయి ఒక్కచోట రక్తాక్తమై యుంటఁ గాంచెను. దొరబాబునకుఁ జూపెను. దొరబాబు బల్లపైనున్న లేఖను దీసి చదువుచుండెను. స్వాములు ఆరక్తము చూపఁబోగ నాతఁడు వారికా లేఖనొసంగి తానద్దానిని పరీక్షింపసాగెను. చిదానందులు దానినిట్లు చదివిరి.

సోదరా!

నేనునీ సర్వనాశకుఁడను. రోజామణిమీద నున్న వలపు తగ్గకునికి మీరు వెళ్ళిపోయినతరువాత కూడ నీకై యున్న

షణాలు సలిపితిని.ఎట్టకేలకు మీరు బెజవాడలో నుంటిరని తెలు సుకొంటిని. బెజవాడ వచ్చితిని. నీవింటలేని సమయము కనిపె ట్టి లోఁ బ్రవేశించితిని. రాజామణియు పూర్వపు నా దుర్మా ర్గప్రవర్తనను మరచిపోయినన్ను సగౌరవముగా లోనికి గొంపోయి ఆతిథ్య మొసంగెను. కాని కామోద్రేకుడ నైన నేను ఆమెను బలవంతపెట్టితిని. ఆ సుస్మేరవదన పరీరంభణా కునై యాశించి యున్న నేను చెరుపఁ బ్రయత్నించితిని. ఆమె నా కెన్నియో నీతులు గరపినది. క్రూరుఁడనగు నేను ఆమెప ల్కులు పాటింపక నాపట్టు వదలకుంట నాపె తప్పించుకొని సహాయముకొఱకై కేకలు వేయఁబోయినది. కర్తవ్యము లేక నేను నా విషచ్ఛురిక దీసి యామెనుఁ జంపెదనని భయ పెట్టితిని. ఆమె కంగారుపడి తన హస్తము నడ్డుగాఁజేసి యాచు ఱకత్తిని నెట్టివైచెను. అపుడామె పల్లవపాణి కొద్దిగా తెగెను. నావిషచ్ఛురిక విషపూరితమగుటచే ఆమె శరీరమెల్ల విషము తోనిండిపోయెను. ఆమె తక్షణమే మృతి నొందెను. ఆ తెగిన చోటు మీ రేరును గుర్తింపరైరి. అపుడు నీబిడ్డనుకూడ చంపి యేయుందు నేమో! కాని అదృష్టవంతుఁడగు వాఁడు ప్రక్కగ దిలో నుంటచేతను ఏరైన వత్తురేమోయను భయముచేతను వెంటనే పరారినైతిని. గోదావరీ వంతెనయొద్ద నిన్నుగాంచి నీవుమరల మాకు ముప్పును గొనిరాగ వచ్చితివని శంకించి నిన్ను పిస్తోలుతో గాల్చితిని. బేస్మెరహింమ్యూఅనువానిని నా

కుమారుఁడు రామారావునుకూడ నిన్నుఁ జంప ప్రోత్సహించితిని. ఇప్పటికి నాపాపము నిండెను ఆ విషచ్ఛురికతోనే పాపపరీహారార్థము ఆత్మహత్య గావించుకొనుచున్నాను. ఇక ముందు నావలన మీకుఁ జిక్కులు రాకుండగనే నేబ్రయత్నములు సలిపితిని. నిన్ను ప్రార్థించెడిదేమన పశ్చాత్తప్త హృదయుడనైన నన్ను క్షమించి నా ఆత్మకు శాంతినిమ్ము. రాములును సరయూను నీబిడ్డలవలె చూచుకొనుము.

నరసింహారావు—



మాధవునిరాక ఆగేహమునందఱికిని ప్రమోదము గొలి
పినది. ఇప్పుడు సౌధమంతయు కళకళలాడు చున్నది. రమేశము
గారు వచ్చిరి. చంద్రశేఖరముగారు మాధవుఁడచటనేయుండిరి.
రమేశము సరయూబాలనాడి పరీక్షించి యామె యారోగ్యము
గనే యుండెననియు, ఎక్కువ నీరసముగా మాత్ర ముండెనని
యుఁ జెప్పెను. అంతలో సరయూబాల కన్నులిప్పెను. వారినం
దరనుజూచి కన్నుల మూసుకొనెను. చంద్రశేఖరముగారు దరి
గాఁజేరి యామెను కుశలబ్రశ్న వైచిరి. ఆమె సమాధానమీయ
లేదు. రమేశముపలుకరించెను. చివరకుమాధవుఁడు 'సరయూ'
అనెను. ఆమె కనులు విప్పెను. రమేశము చంద్రశేఖరముగారు
నవ్విరి. అత్రిపావతి సిగ్గుపడినది. రమేశముగారు మధురనాడిని
చూచి యామెకు జ్వరము చాలవఱకు తగ్గెననియు నాదినము
ననే జావ నీయవచ్చుననియుఁ జెప్పిరి.

అంతలో బండివచ్చి ఆగినది. దానిలోనుండి దొరబాబు
చిదానందులు దిగిరి. వారిద్దరాహ్వానింపఁ బడిరి. చంద్రశేఖ
రముగారు వారికిద్దరకు నభివందనము లొనర్చి సోఫానాధిష్ఠు
లను జేసెను. చిదానందులు యోగానందస్వామి తనగురువనియు
ఆయన శేఖరుగారికి బెజవాఁడలోనిచ్చిన బిడ్డడేడనియుఁ బ్రశ్నిం
చెను. దొరబాబుల్లి జేయుమని చంద్రశేఖరము గారికి సంజ్ఞ
చేసెను. చంద్రశేఖరముగారు మాధవుని సమీపించి ఈఘా

గ్యుం డేనండీ' అనెను. చిదానందస్వాములు మాధవుని సౌందర్యాశ్చర్య ధృఢపరిష్వంగ మందుం జొనిపి యాతనిశిరమును పదే పదే మూర్కొనెను.

దొరబాబు శేఖరునికి చిదానందులే మాధవుని జనకులన్న చెప్పెను. చంద్రశేఖరముగా రాశ్చర్యపడిరి. మాధవ్ని యానందమునకు మితిలేదు. అతఁడు మరలఁదండ్రిని కౌఁగలించుకొనెను.

దొరబాబు—మాధవుఁడే స్వాములవారి యేకపుత్రుఁడు మాధవరావుగారి మనుమఁడు. సరయూను మాధవుఁడు సోదరీ సోదరులు. మాధవుఁడు పెద్దయాస్తి కధికారియే గాక నొక జమీందారు'—మొదలుగాఁగల సంగతులన్నియు నాతఁడు విశదీకరించి శోకరును బెట్టెను.

* * * *

సరయూబాల దురదృష్టవంతురాలు. మిక్కిలి ప్రియతమములైన సోదరుఁడు జనకుఁడు ఆమె కికలేరు. కాని మాధవుఁడే సోదరుఁడు చంద్రశేఖరుఁడే జనకుఁడు నాయెను. వారామె నెంతయో ప్రేమతోఁ జూతురు. అందుచే ఆమె విచారమును మరచిపోయి ఆనందల హరిదేలి యాచుచుండెను. ఆమె నాజూకుఁ జమత్కారము శేఖరాకులను పేయామలహరిని దేలించుచుండును.

* * * *

కొద్దికాలములోనే మధుర ఆరోగ్యవంతురాలయ్యెను. సరయూ దుఃఖవిముఖురాలైనది. వారిద్దరి కన్యోన్య మతీశమై

వెరిగినది. చిదానందరస్వామి తనయుఁడగు మాధవునికి శేఖరం గారి తనయయగు మధురకు వివాహమితి జయప్రదముగా శోభగా జరిగినది. ఆ వివాహమునకు విచ్చేసిన పెద్దలు దొరబాబు' రమేశముగారు, రంగాచారిగారు బహుమానింప బడిరి. మాధవుఁడు సరయూకుఁ దనకు యోగానందులొసంగిన 'మణి' నీ సువర్ణపతకమునం దమర్చించి యామెకుఁ గానుకగా నిచ్చెను. అది కౌస్తుభమణివలె మెఱుంగుచుంట నామెజగన్మోహిని వోలె యున్నది.

చిదానంద స్వాములు కొంతకాల మచట నుండి తిరిగి ఆశ్రమమునకుఁ వెళ్ళిరి. యోగానంద స్వాములువారి పేరను, చిదానందస్వాములవారి పేరను పెద్దపెద్ద మఠములు కట్టబడినవి. అందు సాధువులకు నిరతాన్నదానముం సేయుచుందురు.



25

# 'బేల్తేరహియా, కథనము.

'నన్ను మీరు మరచిపోయి ఉండరు. నాకథ చెప్పెదను వినుడు. ఆరాత్రి నేను వేశ్యా గృహమున నున్నపుడు పెద్దధ్వని వినపడినది. అపాయమును సంకించి నేను బిలసంరక్షణార్థమై రైలు త్రోవ కడ్డుపడి బొమ్మూరిమెట్ట జేరుకున్నాను. ఆధ్వని విని చుట్టుపక్కల వారెవరు నచటకు రాలేదు. కారణమేమనవారు నేనే ఏదో దుండగము చేసియుంటుననియు ప్రాణములు దక్కవనియుం దలంతురు. గృహమట్లు ధ్వంసమగుటజూచి చకితుఁడై పరాధ్యాన్నము నున్న నన్ను గుర్తించి వెంబడించిరి. నేను వారిని బుట్టలోఁ బెట్టితిని. వారిని తినేయాలంటే మూఁడుగుటుకలు కాని నాకేమిపని. నేను మగిడి యటకే వచ్చితిని. ఆగృహము రెండవదారి యున్నటుల నాకొక్కనికే తెలుసును. ఆగృహ రెండవదారి చెఱువుదరి కలదు. ఆగృహము భోపరిభాగమున నే రహస్యమైన యొకగది కలదు. అందు నేనెట్లో బ్రవేశించి అందు నేనెట్లోఁబ్రవేశించి అందు నేను దాచుకొనినపది బంగారు ఇటుకలు జాగ్రత్తగా మూటగట్టుకొంటిని.

తెల్లవారులోపులో నేను నావేశ్య గృహము జేరుకొంటిని. దాని కైన నేనేమీ చెప్పలేదు. నేనిదివరకే యీబంగారమును మార్చుకొనుట నాకిక్కడపాయ కరమనియు వెంకటాద్రిని నరసింహారావు తదితరులను కొట్టికొని కొంతకాలముతిన వచ్చుననియు నపాయము సంభవించిన దొరకకుండ పారిపోవలయుననియు ముందే ఆలోచించితిని. అందుచే ఈమధ్య మదరా

ను వేయి రూపాయిలు ధరావతుఁగట్టి నాకుఁ గావలసినపుడొక విమానమును పంపవలసినదిగా యేర్పాటు చేసుకొంటిని. ఆదినాకిపుడు లాభించెను. నేను వేశ్యాగృహము జేరితిని కదా. అటనుండి 'నేను కోరినది వెంటనే పంపుము' అని తంతివ్రాసి దానిచేఁ బంపితిని. ఇంతలో నేను బిచ్చగాని వేషముదాల్చి మూట చంకలో నిడుకొని కోటిలింగాల కెదురుగా నున్న రేవులో గోదావరిలో స్నాన మాడుచున్నటుల నటించి యాపైకీదుకొనిపోయి యటనున్న దిబ్బపై బట్ట నారవైచు కొంటిని. అనాఁడు అపుడే సాఁయంత్రింమూఁడు గంటలైనది. అపుడు విమానము నేనున్నదిబ్బపై వచ్చిఆగెను. నేను దుస్తులు ధరించుకొనిసిద్ధముగానుంటిని కదా! దాని నధిరోహించితిని అంతలో ఒడ్డున కొక పోలీసుఘూటు వచ్చెను. అందులో రంగాచారి మొదలైనవారు విమానమును పోనీయవలదని సంజ్ఞలతో నాజ్ఞాపించిచిన్నస్టీములాంచీపై రాబోయిరి. అంతలో విమానము గగనాభిముఖమయ్యెను. మేమెగిరి పోతిమి. విమానము నడుపుడ్రైవరు ఎవరిమాటవినెనో ధనమహిమ నేనెచ్చట దిగెదనో పోలీసువారు కనుగొనలేరు. కిసన్‌లాలు ధనమంతయు ఇపుడు నాయొద్దనుంటచే నేనొక ధనికుఁడను. నేను ఎక్కడ జేరి ఏమియొనర్చుచుందునో చూడకుతూహలమున్న నవీన పద్ధతులతో మారుచుండు "రివాల్వారులో 'బేల్ మేరహియాఁ'ను" గనుడు.

GOOD BYE.

సమాప్తము.

రాబోవునది — 'సాలెగూడు'

# నవలలు—పరిశోధకనవలలు.

| | | | |
|---|---|---|---|
| పంజాబుమెయిలు | 0 12 | విషహృదయము | 1 0 |
| సీవేనా | 0 12 | టోపీదాస్ కామిక్ | 0 12 |
| చదువుకొన్నభార్య (Educated wife) | 0 12 | వలపులరాణి | 0 12 |
| శక్తికుమారి | 0 12 | దొంగలనాయకుడు | 0 12 |
| 5 లక్షలరూపాయలు | 0 12 | అర్థరాత్రి పువింత 3 హత్యలు | 0 12 |
| అల్లూరి సీతారామరాజు చరిత్ర | 0 6 | పరిశోధన | 0 12 |
| రమాసుందరి | 1 0 | మోహపిశాచము 1వ భాగం | 0 12 |
| హాతింతాయి | 0 12 | 2వ భాగం | 0 12 |
| ఇంద్రజాలము | 0 12 | రక్తవాహినీ | 0 12 |
| రాజద్రోహి | 0 12 | లోకాభిరామాయణము | 0 6 |

# పూర్వకవులపద్యకావ్యములు—మూలము

| | | | |
|---|---|---|---|
| మనుచరిత్ర అలసాల పెద్దన్న | 0 12 | పారిజాతాపహరణము ము. తి. | 0 12 |
| వసుచరిత్ర | 1 0 | మంత్రపుష్పం | 0 1 |
| మొల్లరామాయణము ఆ. మొ. | 0 8 0 | సారంగధర చే. వెం | 0 12 |
| శృంగారశాకుంతల | 0 12 | కట్టమతశాస్త్రము | 0 12 |
| భర్తృహరిసుభాషితం తాత్పర్యము | 1 0 | హరిశ్చంద్రోపాఖ్యానము శంకరకవి | 0 12 |
| ముకుందమాల టీక. | 0 2 0 | రసికజనమనోభిరామం | 0 10 |
| శ్రీకృష్ణకర్ణామృతంటీక | 0 12 | శృంగారనైషధం శ్రీనాథుడు | 1 0 |

---

**శ్రీరామాబుక్ డిపో రాజమండ్రి.**

# మైలవరం కంపెనీ వారిచే ప్రదర్శింపబడు

## నాటకములు

కనక్తార చం॥ కే॥ 1-4
హరిశ్చంద్రీయ బ బా॥ల॥ 1-0
శ్రీకృష్ణతులాభారము ము॥ సు॥ 1-0
కృష్ణలీలబళ్లారిపం॥ కె. సు॥ 1-4
లవకుశ డిటో 1-4
రంగూన్‌రౌడీ సో॥ —॥ 1-0
వేణీసంహారము వ॥సు। 1-0
సాత్రాజితీయము బ ల. 1-0
ఉత్తరరాఘవం కుశలవ 1-4
రామదాసు బళ్లారిడి. గో 1-0
బొబ్బిలియుద్ధం శ్రీ. కృ 1-0
పాదుకాపట్టాభిషేకము పా. ల. న 1-4
విప్రనారాయణ డిటో 1-0
సారంగధర డిటో 0-8
రాధాకృష్ణ డిటో 0-12
చూడామణి డిటో 0-12
రసపుత్రవిజయముఇ. య 1-0
జయంతజయపాలఆ.స. 0-12
కన్యాశుల్కము గు. అ. 1-0
రోషనార కో. సు. 1-4
గయోపాఖ్యానం చి.ల. 0 8
ప్రసన్నయాదవముడిటో 0-8
పారిజాతాపహరణం ,, 0-8
చతురచంద్రహాస డిటో 0-8
తులసీదేవి ము. వెం. చె. 1-0
చింతామణి కా. నా. 1-0
వరవిక్రయం డిటో 1-0
మధుసేవ డిటో 1-0
పద్మవ్యూహం డిటో 1-0
పాండవవిజయం తి. వెం. 1-0
పాండవోద్యోగము అ.
శ్రీకృష్ణరాయభారం ,, 1-0
పాండవాశ్వమేధం ,, 1-0
సావిత్రి శ్రీ. స. 1-0
ద్రౌపతి మ. అ. 1-0
అనసూయ సో. రా. 1-0
బుద్ధిమతీవిలాసముబ. ల. 1-0
శాకుంతల కం. వీ. 1-0
ధరణికోట సో. రా. 1 4
చండిక ము. వెం. చె. 1-0

శ్రీరామాబుక్ డిపో, రాజమండ్రి